# శ్రీశైలక్షేత్రము

## ( ALL ABOUT SRISAILAM )


రచయిత:

శ్రీ బులుసు - వేంకటరమణయ్య

ఆంధ్రోపాధ్యాయుడు

హిందూ థియలాజికల్ హైస్కూలు, మద్రాసు.





ప్రకాశకులు:

బాలసరస్వతీ బుక్ డిపో,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు

పోస్టుబాక్సు నెం. 3, కర్నూలు.

బ్రాంచి: నెం. 6 సుంకురామచెట్టి స్ట్రీట్, మద్రాసు-1.





1959

[ వెల : రు 1-0-0

# ప్రకాశకుల మనవి

భారత దేశములోని శైవక్షేత్రములలో శ్రీశైలము ప్రధానమైనది. ఉత్తరభారతమున కాశీక్షేత్రమువలె దక్షిణ భారతమున నిది భక్తుల నాకర్షించుచుండును. ఇయ్యది పెక్కు సుందర దృశ్యములు కలిగి, ప్రకృతిరామణీయకమును కన్నులంగట్టునట్లు ప్రదర్శించుచుండును. కావున భగవద్భక్తులను మాత్రమే కాక ఇతరులనుకూడ ఆకర్షించుచుండును.

ఇట్టి సుప్రసిద్ధక్షేత్రముయొక్క మాహాత్మ్యమును గూర్చిగాని, ఇతర దృశ్యములనుగూర్చిగాని, యింతవఱకును ఆంధ్రమున గ్రంథములు వెలువడి యుండలేదు. ఈ యంశమును గ్రహించియే జనసామాన్యమున కందుబాటులోనుండు విధమున శ్రీశైలమునుగూర్చిన విషయముల నన్నింటిని సంగ్రహముగా, సరళమైన భాషలో, సులభమగు శైలిలోం రచింపంజేసి, యీ 'శ్రీశైలక్షేత్రము'ను ప్రకటించుచున్నాము.

ఇందు శ్రీశైల ప్రశస్తితోపాటు క్షేత్ర మాహాత్మ్యమును గూర్చిన వివిధగాథలు, దీని ప్రాచీనత, చారిత్రక విషయములు, గ్రంథములలో దీని ప్రశంస, భౌగోళికముగ దీని ప్రాముఖ్యము, ఖనిజసంపద, వనస్పతుల విశిష్టత, ప్రధాన దేవాలయములు, ఇతర దృశ్యములు, క్షేత్రములోని ఉత్సవములు వివరింపంబడినవి. దీనిని చేరు పురాతన మార్గములు,

ఇప్పటి మార్గములు తెలుపఁబడినవి. పూజలు మున్నగు వానికి భక్తులు చెల్లింపవలసిన రుసుములు, ప్రభుత్వమువారు చేయు సౌకర్యములు స్పష్టముగా నీయబడినవి. రైలు మార్గములు, ముఖ్యమైనరోడ్లు తెలుపుచున్న ఆంధ్రప్రదేశ పటము నీయఁబడినది. ఎడనెడ నీక్షేత్రమునకు సంబంధించిన చిత్రములును, ఛాయాచిత్రములును కూర్పఁబడినవి. దీని యభివృద్ధి మార్గములును కొన్ని సూచింపఁబడినవి. ఇంక శ్రీశైలమును గూర్చిన వివరణలన్నియు నుండుటవలన ఈ క్షేత్రమునకుఁ బోవు భక్తులు ఇతరుల సలహాలనుగాని, సాహాయ్యమునుగాని నపేక్షింపకయే ఈ పుస్తకము సాయమున సులభముగా యాత్రను ముగించుకొని రావచ్చును. ఈచిన్న గ్రంథము వారి కాప్తమిత్రమువలె తోడుపడును.

భక్తులును, భాషావాఙ్మయాభిమానులును తగిన ప్రోత్సాహ మొసఁగినచో ఇట్టి గ్రంథముల నింకను ప్రకటించి ఇతోఽధికముగ ప్రచారసేవ చేయగలమని విన్నవించుచున్నాము.

—ప్రకాశకులు

# కృతజ్ఞత

"శ్రీశైలక్షేత్ర" మను నీ చిన్న గ్రంథమును కూర్చుటలో క్రింద పేర్కొనఁబడిన పత్రికను, గ్రంథములును నాకు మిక్కిలి తోడ్పడినవి. కాన, ఆ యా పత్రికల సంపాదకులకును, ఆ యా వ్యాసముల రచయితలకును, గ్రంథకర్తలకును నే నెంతయు కృతజ్ఞుఁడను.

| | |
|---|---|
| అప్పకవీయము | త్రిపురాంతకోదాహరణము |
| ఆంధ్రపత్రిక | పండితారాధ్యచరిత్ర |
| ఆంధ్రప్రభ | బసవపురాణము |
| ఆనందకందము | మహాభారతము |
| ఆరాధనపత్రిక | రసరత్నాకరము |
| కర్నూలుజిల్లావ్యాస్యాలు | శివరాత్రి మాహాత్మ్యము |
| కావ్యాలంకార చూడామణి | శివానందలహరి |
| కాశీఖండము | శ్రీపర్వతపురాణము |
| కొన్ని శాసనములు | సుందరభారతయాత్ర |

స్కాందపురాణము

శ్రీ బాలసరస్వతీ సంస్థ యజమానులు శ్రీ టి. బాల నాగయ్య శెట్టిగారు, ఈ గ్రంథమును వ్రాయవలెనని ప్రోత్సహించి, నన్ను గౌరవించినారు. భాషావాఙ్మయాభిమానులును, ఉత్తమగ్రంథ ప్రకాశకులు నగు శ్రీ బాలనాగయ్య శెట్టిగారికి నా ధన్యవాదములు.

రచయిత

# శివస్తుతి

వందే శంభు ముమాపతిం సురగురుం
వందే జగత్కారణం
వందే పన్నగభూషణం శశిధరం
వందే పశూనాం పతిమ్,
వందే సూర్య శశాంకవహ్నినయనం
వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం
వందే శివం శంకరమ్. ౧

శివ శివేతి శివేతి శివేతి వా
భవ భవేతి భవేతి భవేతి వా,
హర హరేతి హరేతి హరేతి వా
భజ నమ శ్శివమేవ నిరన్తరమ్. ౨

రత్నసాను శరాసనం రజితాద్రి శృంగనికేతనం
శింజినీకృత పన్నగేశ్వర మచ్యుతానలసాయకమ్,
క్షిప్రదగ్ధ పురత్రయం త్రిదశాలయై రభివందితం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః
ప్రాణాః శరీరం గృహం,
పూజా తే విషయోపభోగ రచనా
నిద్రా సమాధి స్థితిః,

సంచారః పదయోః ప్రదక్షిణవిధిః
స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం
శంభో తవారాధనమ్. ౪

ప్రపంచ సృష్ట్యున్ముఖలాస్యకాయై
సమస్త సంహారక తాండవాయ,
జగజ్జనన్యై జగదేకపిత్రే
నమశ్శివాయై చ నమశ్శివాయ. ౫

ఒకదెస మాతృభావమును
నొక్కదెసం బితృభావముం సదా
శకముగఁ దాల్చి యోగిజన
సంతతి గన్గొను నాంతరంగ వ్య
ష్టికి గుణికైన తపస్యలకుం
.. జేరువ చుట్టమనంగ భక్తరా
జికి నడచేతి సొమ్మగు శ
శిస్ఫుటమౌళిం దలంతు శంకరున్. ౬

# విషయసూచిక

విషయము — పుట

# చిత్రవివరణము

చిత్రము | పుట





# శ్రీశైలము

భారతదేశమునందలి ప్రధాన పుణ్యక్షేత్రములలో శ్రీశైలము పేరుపొందినది. ఈ పేరితో మూఁడు క్షేత్రములు ప్రాచీనకాలముననే ప్రసిద్ధి చెందియున్నవి. ఈ మూఁడును ఆంధ్రదేశమునకే చెందియున్నవి. వీనిలో ఒకటి కర్నూలు జిల్లా-నందికొట్కూరు తాలూకాలో నల్లమల కొండలపైఁ గల శ్రీశైలము. ఇది శైవక్షేత్రము. రెండవది చిత్తూరు జిల్లాలో తిరుమల పర్వతములపై శ్రీ వేంకటేశ్వరుని నివాసమగు శ్రీశైలము. ఇది విష్ణుక్షేత్రము. మూఁడవది గుంటూరు జిల్లాలోని కృష్ణానది తీరమునఁగల బౌద్ధ నాగార్జున నివాసమైన శ్రీశైలము. ఇది బౌద్ధక్షేత్రము.

ఈవిధముగా తెలుఁగునాట శ్రీశైలత్రయము వెలసినను-క్రమముగా శ్రీ వేంకటేశ్వరదేవుని నివాసము తిరుమలగను బౌద్ధక్షేత్రము నాగార్జున-కొండగను ప్రసిద్ధములైనవి. శ్రీశైలమనఁగా నల్లమలలపై గల శ్రీ మల్లికార్జున నివాసమగు శైవక్షేత్రమే యని రూఢమైనది.

ఈ క్షేత్రమునకు శ్రీశైలమనియే కాక శ్రీపర్వతము శ్రీగిరి, శ్రీనగరము మున్నగు పేర్లు వాడుకలో నున్నట్లు గ్రంథప్రమాణములనుబట్టి తెలియుచున్నది.

శ్రీశైలక్షేత్రము సముద్రపుమట్టమునకు 1500అడుగుల యెత్తున దుర్గమములగు పర్వతముల-నడుమ నున్నను, భారత దేశమునందలి నలుమూలలనుండియు భక్తులు వచ్చి స్వామి దర్శనముచేసికొని కృతార్థులగుచుందురు. విశేషించిఆంధ్రులు, కన్నడులు, మహారాష్ట్రులు, తమిళులు ప్రతిసంవత్సరము శివ రాత్రి మున్నగు నుత్సవదినములం దీక్షేత్రమునకు వచ్చుచుం డుట పరిపాటి.

భారత దేశమునందలి ద్వాదశ జ్యోతిర్లింగములలోను ఒకటి యగు శ్రీ మల్లికార్జునలింగ మిచ్చట స్వయముగ ఆవిర్భవించిన దని పెద్దలు చెప్పుదురు. ఈలింగమునకే పర్వత లింగమనుపేరు ప్రసిద్ధమైయున్నది. అష్టాదశ మహాశక్తి స్థలములో ప్రధాన మగు భ్రామరీశక్తి యీ క్షేత్రములో భ్రమరాంబా రూపమున అవతరించి యున్నది.

సాధారణముగా క్షేత్రములలో ఏ యొకక్క-దేవతకో ప్రాముఖ్య ముండును; ఇతర దేవతలకు ప్రాధాన్యము కాన రాదు. శ్రీశైలక్షేత్రమునందు క్షేత్రనామమునుబట్టి శ్రీ మల్లి కార్జునలింగమునకే ప్రాధాన్య మున్నట్లు తోచుచున్నను, ఇచట భ్రమరాంబాదేవికిని ప్రాముఖ్యమున్నది. ఇచట దేవుఁ డెంత ముఖ్యుడో, దేవియు నంత ముఖ్యురాలే! ఇరువురికిని సమప్రాధాన్యము కలదు.

శైవక్షేత్రము లన్నింటిలో శ్రీశైలమే యుత్తమోత్తమ మైనది. కాశీక్షేత్రమున మరణమునఁ గాని ముక్తి లభింపదు. అరుణాచలనమునందు భగవంతుని స్మరించినఁ గాని మోక్షము

కలుగదు. శ్రీశైలమునందో-శిఖరదర్శన మాత్రముననే ముక్తి లభించుననియు, పునర్జన్మ యుండ దనియు ప్రసిద్ధి. ఈయంశ మునే

శ్లో॥ 'కాశ్యాం తు మరణాన్ముక్తిః
స్మరణా దరుణాచలే,
దర్శనాదేవ శ్రీశైలే
పునర్జన్మ న విద్యతే.'

అను నార్యోక్తి వెల్లడించుచున్నది. మఱియు-

'శ్రీశైల శిఖరే దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే.'

అను సుప్రసిద్ధోక్తియు ఈ విషయమునే తెల్పుచున్నది.

శ్రీశైలక్షేత్రము యుగయుగాంతరముల నాటి దని కొందరి విశ్వాసము. కృతయుగములో హిరణ్యకశిపుఁ డిచట మల్లికార్జునుని పూజించెననియు, త్రేతాయుగములో శ్రీరామచంద్రుఁడు తన వనవాస సమయమున నిచటికి వచ్చి స్వామిని సేవించెననియు, ద్వాపరయుగములో పాండవు లిచటికి వచ్చి స్వామిని దర్శించిరనియు, కలియుగమునందు ఆచార్య సిద్ధ నాగార్జునుఁడు మున్నగువారు ఇచట నివసించి స్వామి యనుగ్రహమునకు పాత్రులై రనియును పెద్దలు చెప్పుదురు.

మానవజీవితమునకు శ్రీశైలముతో ఎక్కువ సంబంధ మున్నది. సనాతనసద్ధర్మీకిఁ జెందిన ప్రతి హైందవుఁడును సంకల్పము చెప్పునపుడు శ్రీశైలమును స్మరించి, దానికిఁ దా

నేదిక్కున నున్నదియు చెప్పుచుండును. దీనింబట్టి భారత దేశమున శ్రీశైలమునకుఁగల ప్రాముఖ్యము స్పష్టమగుచున్నది.

ఆదిశంకరు లీ క్షేత్రమునఁ గొన్ని దినము లుండిరఁట! ఆయన యిచట నున్నపు డొక విచిత్ర సంఘటన జరిగినది.

ఆ కాలములో శ్రీశైలప్రాంతమున 'కాపాలికులు' ఉండెడివారు. 'కపాలి' రూపమున నున్న శివుని వారారాధిం చుచు, నరబలివలననే కపాలీశ్వరునికి సంతృప్తి కలుగు నని నమ్ముచుండెడివారు. యువకులును, తేజోరాశులు నగు శంకరు లొకనాఁడు తపస్సులో మునిఁగియుండఁగా ఒక కాపా లికుఁ డాయనవద్దకు వచ్చి, ఆయినను బరిశీలించి చూచి, కపాలీశ్వరునకు బలిగా నిచ్చుట కీయన ఎంతయు నర్హుఁ డని మనమున నిశ్చయించెను. అతఁడు ధ్యాననిమగ్నులై యున్న శంకరులను హెచ్చరించి "అయ్యా! నేను గొప్ప చక్రవర్తి యొక్కగాని, గొప్ప సన్న్యాసియొక్కగాని శిరస్సును సమర్పించి పూజచేసిన యెడల్ల కపాలీశ్వరుఁడు నాకు ప్రత్యక్షమయి కోరిన వరముల నొసఁగఁగలఁడు. కావున మీరు మీశిరస్సును ఖండిం చుట కనుమతింపవలెను" అని పలికెరు. ఆ మాటలు విని శంక రులు చిఱునవ్వు నవ్వి "అయ్యా! దేవునకు నన్ను నీవు బలి యీయఁదలఁచినచో-నా కభ్యంతరము లేదు. ఆత్మరక్షణకు నే నెట్టి ప్రయత్నము చేయను. కాని, నా శిష్యులవలన నీ కెట్టి యాపదయును కలుగకుండ నీ వాత్మరక్షణ చేసికొనవలసి యుండును. ఆ విషయమై జాగరూకత నహించి యున్నచో, నీవు నీ కోరిన రీతిని నన్ను బలి యీయవచ్చును" అని.

సమాధాన మిచ్చిరి. — ఆ మాటలకు కాపాలికుడు మిగుల సంతసించి "సరియే! నా రక్షకుని బాచ్చి నే జూచుకొందును లెండు" అని పలుకుచుఁ తన చేతిలోని కత్తి నెత్తి శంకరాచార్యుల శిరస్సును ఛేదించుటకు సిద్ధముగ నుండెను.

ఆ సమయమున, ఆదిశంకరుల శిష్యుఁ డగు పద్మపాదుఁ డాయనకు రక్షకుఁడై యుండెను. అతఁడు తన గురువునకుఁ గొంతదూరములో నుండుటచే, కాపాలికుని కృత్యమును గమనింపకపోయెను. కాని, తన యోగశక్తివలన తన గురువునకు ఘోరమగు నాపద రానున్నదని తెలిసికొని, కొన్ని మంత్రముల నుచ్చరించుచు త్వరత్వరగా శ్రీశంకరు లున్న చోటికి వచ్చెను. వచ్చి, కాపాలికుఁడు తన గురువును చంపుటకు సిద్ధముగ నుండుటను జూచి, తన గురువును రక్షింపవలె నని శ్రీ లక్ష్మీ నృసింహునిఁ బ్రార్థించెను. శ్రీనృసింహస్వామి ప్రత్యక్షమయి, కాపాలికుని ముక్క ముక్కలుగా ఖండించి శ్రీశంకరులను కాపాడెను. స్వామిని గాంచి శంకరులు పరమానందభరితులై, ఆ దేవునిఁ బొగడుచు నృసింహస్తోత్రమును కూర్చెను.

శ్రీశంకరులు శ్రీశైలమునఁ గొంతకాల ముండి రనుట కును, ఈ స్థలము మహత్తుకలదనుటకు నీ గాథ తార్కాణము కాఁగలదు.

శ్రీశైలక్షేత్రము మిక్కిలి విశాలమగు భూభాగమున విస్తరించి యున్నది. దీని పొడవు ముప్పది యామడలు, వెడల్పు ముప్పది యామడలు నని చెప్పుదురు. దీనికి నలు దిక్కులందును నాలుగు ద్వారములు కలవు. వీని నడుమనున్న

ప్రదేశ మంతయు పవిత్రమైన, పెక్కు క్షేత్రములతో విలసిల్లు చున్నది. దీని తూర్పుద్వారము త్రిపురాంతకము. ఇది కర్నూలుజిల్లా, మార్కాపురము తాలూకాలో నున్నది. దక్షిణద్వారాము సిద్ధవటము. ఇది కడపజిల్లాలో నున్నది. పశ్చిమద్వారము అలంపూరు. ఇది కర్నూలునకు ప్రక్క నున్నది. ఉత్తరద్వారము ఉమామహేశ్వరము. ఇది తెలంగాణమున నున్నది. ఈ నాలుగు ద్వారములును పవిత్ర స్థలములే! వీనిలో పెక్కు పుణ్యతీర్థములును, అనేక దేవాల యములును కలవు.

సమతలముతోఁ గూడిన శ్రీశైలము 1500 అడుగుల యెత్తుగలిగి, చల్లని వాతావరణముతో హాయిని గూర్చు చుండును. ఇది తూర్పు పశ్చిమములకు మూడు మైళ్లు, ఉత్తర దక్షిణముల కాఱుమైళ్లు విస్తీర్ణము కలిగియుండును. ఒక చోట అడవి, వేఱొకచో ఱాళ్లు, ఒక్కెడ వాగులు కలిగిన ప్రకృతి శోభ కాలవాలమై కన్నులపండువై యుండును.

-----

# స్థలమాహాత్మ్యము

పుణ్యక్షేత్రముల కన్నింటికిని ఏదో యొక స్థలపురాణ ముండి తీరును. శ్రీశైలమునకును అట్టి స్థలపురాణము స్కాందమునందలి శ్రీశైలఖండమునఁ గానవచ్చుచున్నది. ఇది 32 అధ్యాయములలో 12 500 గ్రంథములలో వివరింపఁబడినది. ఈ మాహాత్మ్యమును తొల్లి పార్వతికోరికపయి పరమేశ్వరుఁడు చెప్పె నఁట! దానినే వేదవ్యాస మహర్షి కోరికపయి సనత్కుమారుఁడు తరువాత తెలిపిన ట్లందుఁ గలదు. దీనినే నాగఁటూరి శేషనాథార్యుఁ డను కవి శ్రీపర్వతపురాణ మను పేర నొక పద్యకావ్యమును రచించి యున్నాఁడు.

ఈ మాహాత్మ్యమునందు శ్రీశైలమునకు-లేక శ్రీపర్వతమునకును, మల్లికార్జునస్వామికిని, భ్రమరాంబాదేవికని ఆ యా నామములు కలిగిన విధము వివరింపఁబడినది.

ఆదికాలములో శిలాదుఁ డను పేరు గల మహర్షి యుండెను. ఆతనికిఁ జాలకాలమునకును పుత్రసంతతి లేకుండెను. కావున, ఆ ముని భగవంతునియెడల భక్తిభావము కల పుత్రులను ప్రసాదింపవలెనని శంకరునిఁ గూర్చి తపస్సు చేసెను. అతని తపోనియమమునకు సంతుష్టుఁడై యీశ్వరుఁ డిరువురు పుత్రులు కలుగున ట్లతనికి వర మొసఁగెను. ఆ పుత్రులలో ఒకఁడు నందీశ్వరుఁడు. వేఱొకఁడు పర్వతుఁడు. పుట్టినప్పటి

నుండియు వీ రిరువురును దైవభక్తి కలిగియుండి, పరమశివునిఁ గూర్చి ఘోరమైన తపస్సు చేయసాగిరి.

కొంతకాలమునకు పరమేశ్వరుఁడు నందీశ్వరునకుఁ బ్రత్యక్షమై వరమును వేఁడుకొనవలెనని యడుగఁగా, అతఁడు "సదా నీవు నాపై నివసించి నీ వాహనభాగ్యమును నాకు లభింపఁ జేయుము; నీవు నివసించు ఆస్థలము నాపేర నెలకొను నట్లు వరము ననుగ్రహింపుము" అని కోరెను. పరమశివుఁ డట్లే యనుగ్రహించెను. నందీశ్వరుఁ [illegible] కొండగా మాఱఁగా, శివుఁ డచ్చట నెలసెను. ఆస్థలము నందనుండల మను పేరఁ బ్రసిద్ధమై శ్రీశైలమునకు నైరృతిదిశగా [illegible] మైళ్ల దూరమున ఉన్నది.

కొంతకాలమునకుపరమేశ్వరుఁడు పర్వతునికిని ప్రత్యక్షమయి వరము కోరుకొమ్మనెను. పర్వతుఁడు భక్తితో [illegible] లితహస్తుఁడై "పరాత్పరా! పర్వతరూపము ధరించిన నాపై నీవు స్థిరముగా నివసించవలెననియు, నేను తపముచేసిన యిచ్చోటనే పర్వతలింగ మనుపేర ఆవిర్భవించి, యీ స్థలమును [illegible]ను నొనర్పవలెననియు నా ప్రార్థన" అని విన్నవించెను. [illegible] పరమేశ్వరుఁడు 'ఓయీ! నీ యీ కోరిక లోకోపకారక [illegible] [illegible]ను నెఱవేర్తును. వేఱొకటి కోరుకొనుము' [illegible] పర్వతుఁడు 'దేవదేవా! భూలోకమునం [illegible] నిచట సన్నిధానముపొంది సర్వదేవత [illegible] అని ప్రార్థించెను. 'ఈ వరము [illegible] వరముకూడ [illegible]

కొను' మని పరమేశ్వరుఁడు పలికెను. అంత పర్వతుఁడు 'జగత్ప్రభూ! నీ వావిర్భవించియుండు పర్వతముయొక్క శిఖరమును జూచినవారికి పునరావృత్తిరహిత మైన మోక్షము లభించును గాక! ఇంతకంటెను నేఁ గోరఁదగిన వర మేదియును లేదు' అని పలికెను.

పరమేశ్వరుఁడు పర్వతుఁడు కోరిన వరముల నను గ్రహించి యంతర్ధాన మందెను. ఆ పర్వతుఁడే శ్రీశైలముగా మాఱెను. తచ్ఛిఖరముపయి పర్వతలింగనామమున శంకరుఁ డావిర్భవించెను. అతని యాదేశము ననుసరించి సర్వదేవత లును, సమస్త పుణ్యతీర్థములు నట విలసిల్లెను. భక్తజనుల పాపములను హరించుచు, శిఖరమును దర్శించినవారికి ముక్తి నొసంగుచు, ఈ క్షేత్రము భారతదేశమునందలి శైవక్షేత్రము లలో ప్రధాన మయి వన్నె కెక్కినది.

పర్వతుని కోరిక ననుసరించి యేర్పడిన యీ క్షేత్రము పర్వతక్షేత్రము—లేదా—శైలక్షేత్రము అని ప్రసిద్ధమై యుండ వలెను. దానిముందు 'శ్రీ' అనునది చేర్పబడుట యేల? అని ఎవ్వరైనను సందేహింపవచ్చును. ఈ 'శ్రీ' కారము చేరుట కును ఒక ఇతిహాసము కలదు.

కృతయుగములో వసుమతి యను నొక మునికన్య శివునిగూర్చి యిచట ఘోరతపస్సు చేసినది. దేవదేవుఁడు ప్రత్యక్షము కాఁగా తనపే రగు 'వసుమతి' అనుదానికి బదు లుగా 'శ్రీ' అను నామము స్థిరపడునట్లును, తనపేరితోనే యీ పర్వతక్షేత్రము ప్రసిద్ధమై యుండునట్లును ఆమె వరము

కోరినది. భగవంతుఁడట్లే వరమొసఁగెను. అందువలననే దీనికి శ్రీశైలము లేక శ్రీపర్వతము-అను పేరు ప్రసిద్ధమై యున్నది.

పర్వతుని కోరిక మేరకు 'పర్వతలింగ' నామమున వెలసిన పరమశివునకు 'మల్లికార్జున' నామము కలుగుటకుఁ గారణము లేకపోలేదు. దానింగూర్చిన యితిహాసము స్కాందపురాణముననే యున్నది.

పూర్వము చంద్రగుప్తయను పట్టణముండెను. ఆపట్టణము రాజధానిగాఁ దత్పరిసర ప్రదేశములను చంద్రగుప్తుఁడను గుప్తవంశపురాజు పరిపాలించుచుండెను. చంద్రవతి యాతని కుమార్తె. చక్కని చుక్క. ఆమెకుఁ బసితనమునుండియు శివభక్తి మెండు. ఆ బాలిక దినదిన ప్రవర్ధమానయై యుక్తవయస్కురాలయ్యెను. పలువురు రాజపుత్రులామెను పాణిగ్రహణము చేసికొనుటకుఁ గుతూహలపడుచుండిరి. కాని యైహికసుఖలపట్ల ఆవంతయు నాశలేని చంద్రవతి పరమేశ్వరునియందే మనస్సు నిలిపి, మనుష్యమాత్రులను వివాహమాడ సమ్మతింపకుండెను. తన జీవితమును భగవదర్పణమొనర్చుటకే యామె సంకల్పించి శ్రీశైలమునఁ బరమేశ్వరునిఁ బూజించుచుఁ గాలమును గడపసాగెను. ఆమె ప్రతిదినము తెల్లని మల్లెపూవులను దండలుగాఁ గట్టి వానిచేఁ బర్వతలింగము నలంకరించుచుండెను. ఆమె దీక్షకును, భక్తికిని పరమేశ్వరుఁడు సంతసించి వరము వేడుమని యడిగెను. ఆమె-

క. ఈ మల్లికా ప్రసూనపు
దామము గంగాఘనాంబుధారణ లీలన్



చంద్రవతికి పరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుట

ప్రేమంబు నవధరింపుము
కామాంతక తుహినధామ కళయును గోలెన్.'

[ఓ పరమేశ్వరా! నీ శిరస్సుపై పరిశుద్ధమగు గంగా ప్రవాహమును ధరించినట్లు తెల్లని మల్లికల దామమును నీ తలపై ధరింపుము. నీ మౌళిపయి చంద్రరేఖ భూషణమై ప్రకాశించుచున్న ట్లీమాలికయు ఎల్లపుడును ప్రకాశించుచుండును గాక!]

అనియు, దయతోఁ దన్ను పరిగ్రహింపవలె ననియుఁ గోరెను. పరమేశ్వరుఁడు చంద్రవతి కోరినట్లు వర మొసంగెను. మఱియు నతఁ డిట్లనెను –

మల్లికా పుష్పములతోడ మమ్ముఁ బూజ
సల్పితివి కాన మల్లికార్జునుఁడ నేను;
భ్రమరకీటకన్యాయము భక్తుల యెడఁ
జూతు! వల్లోట భ్రమరాంబ నైతి వీవు.'

[తెల్లని మల్లెలతో మమ్ము పూజించినందున మాకు మల్లికార్జునుఁ డను పేరు కలిగినది. నీవు భ్రమరకీటన్యాయమున భక్తులను జూచుచున్నందున 'భ్రమరాంబ' నామమునఁ బ్రసిద్ధురాల వైతివి.]

'అర్జున' పదమునకు 'తెల్లనిది' అని యర్థము. తెల్లని మల్లెపూలమాలికలు ధరించుటవలన పర్వతలింగమునకు 'మల్లికార్జున' నామము కలిగెను. ఆ దేవదేవుఁడు చంద్రవతి కోరిక ననుసరించి యామెను అర్ధాంగిగా గ్రహించెను.

భ్రమరము ఒక కీటకమును దనగూటిలోనుంచి, ధ్వని చేయుచు నా గూటిచుట్టును తిరుగుచున్నయెడల, కొంతకాలమున కా గూటిపురుగుకూడ భ్రమరముగా మాఱును. దీనికే భ్రమరకీటన్యాయ మని పేరు. ఆ విధముగనే శివుని భార్యగా నయిన చంద్రవతి భక్తులను తనతోపాటు పరమశివునియం దత్యంత భక్తిశ్రద్ధలు కలవారినిగాఁ జేయును. అందువలననే ఆమెకు భ్రమరాంబ యను పేరు సార్థకమై యున్నదఁట!

ఈ కథ స్కాందపురాణములో నున్నది. ఇయ్యది కోఁగవలకును 16-వ శతాబ్దిలో శిలలపై చెక్కఁబడియున్నది.

శ్రీశైలక్షేత్రమునకు వచ్చు యాత్రికుల కచటి స్థలజ్ఞులీక్షేత్రమాహాత్మ్యమును వేఱొకవిధముగాఁ జెప్పుటయును కలదు. ఆ విధాన మిది –

'కృష్ణానదికి ఉత్తరమున చంద్రగుప్తపట్టణ మను నగర మొకటి యుండినది. దానిని రాజధానినిగా ఒనర్చుకొని చంద్రగుప్తుఁ డను రాజు చుట్టుప్రక్కల నున్న ప్రదేశములను పాలించుచుండెను. చంద్రవతి యతని కుమార్తె. మిక్కిలి యందకత్తె. ఆ బిడ్డ పుట్టిన కొలఁదికాలముననే చంద్రగుప్తుఁడు శత్రురాజులపైకి దాడివెడలి పెక్కేండ్లు దేశాంతరములలోనే గడపెను. కొంతకాలమునకుఁ దిరిగివచ్చిన రాజునకుఁ దన యంతఃపురములో లోకోత్తరసౌందర్యవతి యగు చంద్రవతి కానవచ్చెను. ఆమె యందమునకు ముగ్ధుఁడైన రాజున కామెపై వలపు కలిగెను. ఆ బాలిక తన పుత్రికయే యనియు, ఆమెపై వలపుగొనుట మిక్కిలి అధర్మ మనియు రాణి యెంత

బోధించినను చంద్రగుప్తుఁడు వినక మూర్ఖతతో నా బాలికను వివాహమాడ నిశ్చయించెను. ఒకప్పుడు రాజు బాలికను నిర్బంధించుటయును జరిగెను. తండ్రిప్రవర్తనను చంద్రవతి మిక్కిలి యేవగించుకొని, మిగుల కోపించి యాతని రాజ్యము నశించునట్లు శపించి, ఆత్మరక్షణకయి శ్రీశైలప్రాంతారణ్యమునకుఁ బోయెను. ఆమె యా పర్వతముపైనే నివసించుచు, అచటి యడవులలో లభించు పండ్లు భుజించుచు, ఆవులపాలు త్రాగి జీవయాత్ర సాగించుచుండెను. ఇంతలక్కె యామె కొన్ని యావులను పెంచుకొనుచు, వానిని మేఁతకు తోలుకొని పోవుటకును, సంరక్షించుటకును ఒక గొల్లవానిని నియమిం చెను.

ఆమెయొద్ద నున్న గోవులు ప్రతిదినము సక్రమముగ పాలు ఇచ్చుచుండును. కాని, వానిలో నొక్క గోవుమాత్రము ఒక్కనాఁడయినను పాలీయక ఉత్త పొదుగుతో తిరిగివచ్చుచుం డెను. దీనిని గాంచిన రాజపుత్రిక కాశ్చర్యము కలిగెను. ఆ గో వెక్కడికి పోవుచుండునో కనిపెట్టి రావలెనని యామె గోపాలున కాజ్ఞ యిచ్చెను. మఱునాఁడు వాఁడు ధేనువు వెనుకనే పోయెను. ఆ గోవు తిన్నగా శ్రీశైలముమీఁదికి పోయి లింగాకారముగ నున్న యొక రాతిపైఁ దన పాలను జాలువార్చెను. ఈ విషయమును గొల్లవాఁడు రాజకుమారికిఁ దెలిపెను. ఆమెయు నచ్చెరువంది మఱునాఁడు స్వయముగా ఆ ధేనువువెంటఁ బోయి, గో వాక లింగముపై పాలతో నభిషేక మొనర్చుటను కనులారఁ గాంచి చకితురాలయ్యెను.

ఆ గోవుచే క్షీరాభిషేకమును పొందుచున్న లింగమే పర్వత లింగము!

శివప మల్లికార్జున దేవుడా రాజకుమారికి స్వప్నమున ప్రత్యక్షమై తనకొక యాలయమును కట్టింపవలెనని కోరెనట! చంద్రవతి యట్లే ఆలయమును కట్టించి, భక్తిభావము వెల్లివిరియ నిత్యము ఈశ్వరారాధన మొనర్చుచు జీవిత శేషమును గడపెను.

ఈగాథ శ్రీశైలక్షేత్రమున ఆలయప్రాకారమునకు వెలుపలి భాగమున గల రెండు స్తంభములపై చెక్కబడియున్నది.

పర్వతమునకు శ్రీపర్వత మనియు. పర్వతలింగమునకు 'మల్లికార్జున లింగ' మనియును నామములు కలుగుటకు కారణమును వివరించు వేరొక గాథయును కలదు.

కొన్ని యుగములక్రిందట నిచ్చట శిలాదుడను మహర్షి నివసించుచుండెను. ఆతనికి శ్రీదేవి యను పుత్రికయు, పర్వతుడను కుమారుడు నుండిరి. వారిరువురును శివభక్తులు. వారిరువురును మహేశ్వరునిగూర్చి ఘోరముగా తపమొనర్చి, ఆ దేవుని ప్రత్యక్షముచేసికొని కృతార్థులైరి. తత్ఫలితముగ ఈపర్వతమునకు శ్రీపర్వతమనియు, ఇచ్చటి శివలింగమునకు శ్రీపర్వతలింగ మనియు పేర్లు ఏర్పడినవి. ఈ విధముగ తమ యిరువురి నామములు ఆచంద్రతారార్కముగా - స్థిరముగా నిల్చినందుకు ఆ శ్రీదేవీపర్వతులు కృతార్థులైరి.

పిదప పాండవు లరణ్యావాస మొనర్చునపు డీస్థలమునకు వచ్చిరి. శివభక్తు డగు నర్జునుఁడు గొప్ప నియమముతోఁ బ్రతిదినమును శ్రీపర్వతమును మల్లెపూవులతోఁ బూజించుచుండెడివాఁడు. అర్జునుడే తన నామమును, తాను పూజించు మల్లికల నామమును జేర్చి శ్రీపర్వతలింగమునకు మల్లికార్జునలింగ మని పేరుపెట్టెను. నాటినుండియు శ్రీశైల లింగము మల్లికార్జునలింగముగా ప్రసిద్ధి కెక్కెను.

భ్రమరాంబాదేవినిగూర్చియు నింకొక యితిహాసము కలదు. ఆమె అష్టాదశ శివభక్తులలోని భ్రామరీశక్తి యని యిదివరకే చెప్పబడినది కదా! ఆమె వృత్తాంతము దేవీ భాగవతమునం దిట్లున్నది—

'పూర్వకాలములో అరుణుఁ డను రాక్షసుఁ డుండెడి వాఁడు. అతఁడు బ్రహ్మనుగూర్చి ఘోరతపస్సు చేసి, శస్త్రాస్త్రములచేఁగాని, స్త్రీపురుషులచేఁగాని, ద్విపాచ్చతుష్పాత్తులచేఁ గాని తనకు మరణము కలుగకుండునట్లు వరము పొందెను. ఆ వరలాభమున గర్వించి యతఁడు లోకములోని ప్రజల నందఱిని గగ్గోలుపఱచెను. కావున నా క్రూరరాక్షసుని సంహరించుటకు భ్రామరీశక్తి పూనుకొనవలసి వచ్చెను. ఆ దేవి కోట్లకొలఁది తుమ్మెదలతో—అనగా భ్రమరములతోఁ గూడిన పుష్పమాలికలను ధరించి యావిర్భవించెను. ఆమె ధరించిన పూలమాలలపై నున్న భ్రమరములు చెలరేఁగి దానవుల నందఱిని తఱిమి వేసినవి.

భ్రామరీశక్తి స్వరూప యగు భ్రమరాంబ వరప్రసాదిని యగు కన్య యంట! ఆమె నివాసము మైసూరురాష్ట్రము. కావుననే దేవి సన్నిధిని చైత్రోత్సవము జరుగునపుడు మైసూరు ప్రాంతీయులు తమ యాఁడుపడుచునకుఁ గానుకలు తెచ్చి యిచ్చుట ఇప్పటికిని జరుగుచునే యున్నది.

ఈ రీతిగా శ్రీశైలక్షేత్రమునకు సంబంధించిన ఇతిహాసములు వేర్వేఱు విధములుగ నున్నవి. అవి విభిన్నములుగ నున్నను - అవి యన్నియును క్షేత్రముయొక్క మహిమనే వ్యక్తము చేయుచున్నవి.

[గమనిక :- చంద్రగుప్తుని పుత్రిక 'చంద్రావతి' యని కొందఱును 'చంద్రవతి' అని కొందఱును తలంచుచున్నారు. కాని 'దయచేయు మనుచుఁ జంద్రవతి వేఁడుటయు' అను గ్రంథస్థ ప్రమాణమునుబట్టి కూడ ఆమె పేరు 'చంద్రవతి' అనియే నిర్ణయింపనగును.]

# చరిత్ర విషయములు

పురాణగాథలనుబట్టి శ్రీశైలక్షేత్రము యుగయుగాంతరములనాటిదని తోఁచును. కాని, పురాణగాథలనుబట్టి కాలనిర్ణయముచేయుట యుక్తము కాదు.

చంద్రవతీ వృత్తాంతమునుబట్టి గుప్తవంశపురాజుల కాలమున నీ క్షేత్రము విలసిల్లెనని యూహించుట కవకాశము కలదు. చంద్రగుప్తుఁ డాకాలమున శ్రీశైలప్రాంతమునకు ప్రభువై యుండవచ్చును

నామసామ్యమునుబట్టి చంద్రగుప్త మౌర్యుఁ డీ ప్రాంతమునకు ప్రభువై యుండెనని కొందఱు భ్రాంతిపడుచున్నారు. కాని, అట్లూహించుటకుఁ దగిన యాధారములు కానరావు.

నల్లమల కొండల నెక్కి సమప్రదేశమునకుఁ బోఁగా మండపములయొక్కయు, కుడ్యములయొక్కయు, భవనములయొక్కయు శిథిలభాగములు అసంఖ్యాకముగఁ గానవచ్చుచున్నవి. వీనినిబట్టి ఇచట పూర్వము గొప్పదుర్గ ముండినట్లును, అందు పెద్దనగర ముండినట్లును స్పష్టముగాఁ దెలియుచున్నట. నూతన గృహనిర్మాణమునకయి జరిగిన త్రవ్వకములలో— ప్రాచీన గృహభాగములు, విశాలములగు వీథులు, మార్గములు బయలుపడినవి. పూర్వ మీ క్షేత్రమున 8800 గృహము [illegible] యూహింపఁబడుచున్నది.

పూర్వము మిక్కిలి వైభవముతో నుండిన యీ క్షేత్రము క్రీ. శ. 3-వ శతాబ్దిలో - ఇక్ష్వాకుల కాలమున బౌద్ధ, శైవ కలహముల మూలమున నష్టప్రాయమైనది. క్రీ. శ. 6-వ శతాబ్దములో కదంబవర్మ శ్రీశైలము వఱకును గల అరణ్యరాజ్యముల నాక్రమించుకొన్నట్లు శాసనములు కలవు. ఇది చాళుక్యుల కాలమునందు పునరుద్ధరింపఁబడి, కాకతీయుల కాలమున మిక్కిలి యభివృద్ధిని గాంచినది. తురుష్కుల కాలమున క్షీణదశకు వచ్చి, రోహిల్లాల దోపిడుల మూలమున శిథిలమైపోయినది.

శ్రీశైల విషయము స్కాందపురాణమున నుండుట వలనను, పురాణములు వ్యాసకర్తృకము లని భావింపఁబడుటవలనను—ఈ క్షేత్రము మిక్కిలి ప్రాచీనమని తోఁచుచున్నది. వ్యాసమహర్షి తన గురువైన ఘంటాకర్ణ శివాచార్యులతోఁ గలిసి యిచట తపస్సు చేసినట్లును, అప్పుడు శ్రీశైలఖండమును రచించినట్లును, ఇచటి ఘంటాకర్ణమఠమే వ్యాసుని గురుమఠ మైనట్లును. లింగాయతుల విశ్వాసము,

ఆదిశంకరులు తమ శివానందలహరిలోని రెండు శ్లోకములలో 'సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితం' అని యీ క్షేత్రమును ప్రశంసించి యున్నారు.

ఆదిశంకరులే కాక. రేణుకాది పంచాచార్యులు. బసవాది శివశరణులు, గోరక్షుఁడు మున్నగు నవనాథులు, అక్కమహాదేవి, హేమారెడ్డి మల్లమ్మ మున్నగువారును ఇక్కడ తపస్సుచేసి సిద్ధిపొందినట్లు తెలియుచున్నది. సాతవాహన

రాజు లిచటికివచ్చి, ఇచటి రససిద్ధుల మూలమున అపారముగా వెండి, బంగారములను తయారుచేసి, తమరాజ్యరక్షణమునకై వానిని వినియోగించినట్లు రసవాదగ్రంథములవలనఁ దెలియ వచ్చుచున్నది.

క్రీ. శ. 7-వ శతాబ్దిలో భారతదేశమునకు వచ్చిన యువాన్ త్సాంగ్ అను చీనాయాత్రికుఁడు వ్రాసిన వ్రాఁతలను బట్టి, అతఁడు శ్రీశైలమును, నాగార్జునుని ప్రస్తావించినట్లు తెలియుచున్నది. అతఁడు చెప్పిన 'పో-లో-ము-లో-కి-లి' శ్రీశైలమనియు, 'పో-తో-ఫా-సో' నాగార్జునుఁ డనియు నిర్ణ యింపఁ బడినది. కాని, చీనాయాత్రికుఁడు తెల్పిన నాగార్జు నుఁడు బౌద్ధనాగార్జునుఁడు కాని, సిద్ధనాగార్జునుఁడు కాడనియు, అతఁడు స్మరించిన శ్రీశైలము నేఁటి నాగార్జునకొండ గాని శ్రీశైలక్షేత్రము కాదనియు చరిత్రకారులచే నిర్ణయింపఁ బడినది.

క్రీ. శ. 14-వ శతాబ్దిలో నుండిన కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రదేవుఁడు మొదలుకొని 17-వ శతాబ్దినాఁటి విజయ నగర చక్రవర్తి రామదేవుని వఱకును నలువదికి పైగా శాసన ములు శ్రీశైలదేవాలయములోఁ గానవచ్చుచున్నవి. వాని వలన పెక్కు విషయములు తెలియుచున్నవి.

14-వ శతాబ్ది ప్రారంభమున ఆలయనిర్వహణ వ్యవ హారములకు సంబంధించి యున్న ఇచటిశాసనమే ప్రాచీన మైనది. అరసి శైవమతాధిపతి ఈశ్వర శివాచార్యులును, మఱి కొందఱ అధికారులును శ్రీశైలాలయమును నిర్వహించుచున్న

విషయ మిందులోఁ గలదు. మఱియు నిందు, ఆలయమునకిచ్చిన డెబ్బది గ్రామముల పేర్లు, తెలుఁగు దేశములోని రాజులయు, నాయకులయు నామములును ఉన్నవి.

తర్వాతిది జగనొబ్బగండ బిరుదాంకితుఁడు కొండవీటి ప్రభువు - అనవేమారెడ్డి కాలమునాఁటి శాసనము. అతఁడిచ్చట వీరమండపమును కట్టించిన వృత్తాంత మీ శాసనములోఁ గలదు.

"శ్రీపర్వత స్థలి చెలు వగు శ్రీమల్లికార్జునస్వామి గేహాంగణమున, మహనియ్య మగు వీరమంటపం అనే కప్ల విలసితం బగు పుణ్య స్థలి నొప్ప కట్టించి జగనొబ్బగండ్డన్న - వేమ భూవిభుని...శ్వరధర్మ విభవ కీర్తి సకల దిక్కులు నిండి సాంద్రమై ఆచంద్రతారకః స్థితి నుర్వి తనరం జేసె శాంకరా.........అన్న వేమయ రెడ్డింగారు తమ తండ్రి అన్నయ రెడ్డింగారికి పుణ్యముగా కట్టించే...మండపము—" అనునది ఆ శాశనములోని కొంతభాగము.

పాతాళగంగకుఁ బోవు మార్గములో మూఁడు స్తంభములపై నాగరి, గ్రంథాక్షరి, తెలుఁగు లిపులలో చెక్కిన శాసనము లున్నవి. వానినిబట్టి ఆ స్థలమునకు వెళ్లుటకు కదంబ రాజకుమారి విఠలాంబ 14-వ శతాబ్ది చివఱ మెట్లు కట్టించి నట్లు తెలియుచున్నది.

రెండు ప్రక్కల వసారాలతో, పెద్దరాతి స్తంభములతో ద్వారములతో నున్న ఆలయముఖమండపమును శాలివాహన

శకము 1326 కు సరియగు క్రీ. శ. 1404-1405 లో ప్రబుద్ధ దేవరాయలు శ్రీశైల దేవాలయమును దర్శించినప్పుడు కట్టించెను. ఆ మండపము శ్రీస్వామివారికి కానుకగాఁ గట్టింపఁబడినదఁట! ఆరాజు తనసోదరిని, కొందఱు పరిచారికలను వెంట నిడుకొని అపుడు స్వామిదర్శనమునకు వచ్చెనఁట!

క్రీ. శ, 1402-1420 నడుమ నుండిన పెదకోమటి వేమారెడ్డి కాశీయాత్రకుఁ బోవుచు, తొలుత నీ శ్రీశైలమును దర్శించినట్లు శాసనాధార మున్నది.

కొంతకాలము విజయనగరరాజ్యమును పాలించిన సాళువ వంశపురాజులు గొప్ప శివభక్తులగుటచే-శ్రీశైలముపై జనోపయోగార్థ మొక చెఱువును త్రవ్వించిరట్లు తెలియుచున్నది.

విజయనగరము రాజధానిగా దక్షిణదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలిన శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశముపైకి దండెత్తిపోయి, విజయము పొంది తిరిగి వచ్చినపుడు శ్రీశైలమునకు వచ్చి స్వామిని దర్శించెను. అప్పుడిచ్చటి రథవీథికి రెండువైపులను వరుసగా కొన్ని మండపములను కట్టించెను. పెక్కు గ్రామములను దానము చేసెను.

రాయల సామంతుఁడగు చంద్రశేఖరరాయలు శ్రీశైల ప్రాంతమున కధిపతి యైనపిదప శ్రీశైలస్వామికి బంగారునందిని బహూకరించెను. ఆ సమయమునందే శాంతలింగయ్య యను వేఱొక సామంతుఁడు మల్లికార్జునున కొక రథమునుచేయించి

యిచ్చెను. తీర్థయాత్రికుల సౌకర్యమునకయి యితఁడొక కాలువను త్రవ్వించెను. ఈ శాంతలింగయ్యయే జంగములకును బ్రాహ్మణులకును అగ్రహారముల నిచ్చినట్లును, ముఖమండప దరిభాగములకు బంగారుపూత పూయించినట్లును, ప్రాకారమును, తూర్పువైపున నున్న గోపురమును పునరుద్ధరించి నట్లును, అచటి మహాజనులకు మఱికొన్ని దానములు చేసి నట్లును సాక్ష్యము లున్నవి. వర్తక సంఘములవారు మల్లికార్జున దేవుని యాలయమునకు ఉద్యానవనముల నేర్పరచి నట్లును, పెక్కు చెఱువులను త్రవ్వించినట్లును, భూములను దానముచేసినట్లును తెలియుచున్నది. మహారాష్ట్ర చక్రవర్తి ఛత్రపతి శివాజీ యిందలి ఉత్తరగోపురమును నిర్మించెను. అది 'శివాజీగోపురము'గా ప్రసిద్ధమై యున్నది.

విజయనగర సామ్రాజ్యము పతనమునుపొందిన పిదప శ్రీశైలదేవస్థానము క్షీణదశకు వచ్చినది. 18-వ శతాబ్దిలో మన్నావర్ ఖాను పరిపాలించుచున్నపుడు బందిపోటుఠాంగ లీ దేవాలయమును దోచుకొన్నారు. అంతకుఁ బూర్వము కొలఁదిగా నిచట నివసించుచుండిన జనులుకూడ ఠాంగల భయమున నీక్షేత్రమును విడిచి స్థలాంతరములకు వెడలిపోయిరి.

క్రీ. శ. 1794లో కర్నల్ కాలిన్ మెకెంజీ ఇచ్చటికి స్వయముగా వచ్చి చూచిన విషయములు కర్నూలుజిల్లా మాన్యుయల్‌లో వివరింపఁబడినవి. ఆ విషయము లప్పటి దేవాలయపు దయనీయస్థితిని వెల్లడించుచున్నవి.

అట్టి క్షీణస్థితిలో నుండిన యీ క్షేత్రమున కిప్పుడు మంచిదినములు వచ్చినవి. కేంద్రప్రభుత్వము, ఆంధ్రప్రభుత్వము నీ క్షేత్రమును పునరుద్ధరించుటకుఁ బూనుకొని, తొలుదొల్త చక్కని మార్గమును నిర్మించినవి. ఉదారు లగు భక్తులు యాత్రికుల సౌకర్యమునకు భవనాది నిర్మాణమున ప్రభుత్వమునకుఁ జేదోడు, వాదోడు నగుచున్నారు. కొలఁదికాలములో నీ క్షేత్రము ప్రాచీనకాలపు ఔన్నత్యమును పొందఁగల దని విశ్వసింపవచ్చును.

# సాహిత్యములో శ్రీశైల ప్రస్తావన

అర్జునుని తీర్థయాత్రా సందర్భమున మహాభారతములో 'శౌఢఁ గగుచున్న శ్రీ పర్వతంబునకు జూచి' అని శ్రీశైలము ప్రస్తావింపఁబడినది. కావున తెలుఁగున ఆదికవి యగు నన్నయ భట్టునుండియు వాఙ్మయమున ఈ క్షేత్రము ప్రస్తావింపఁ బడు చునే యున్న దని చెప్పవచ్చును. శైవక్షేత్ర మగు నీ శ్రీశైల మును శివకవు లందఱును ప్రశంసించియున్నారు. శైవపండిత త్రయములో ముఖ్యుఁ డగు పండితారాధ్యుఁడు సంస్కృతమున రచించిన 'స్తుతిశ్లోక పంచకము, పర్వతవర్ణన' అను గ్రంథము లీ శ్రీశైలమునకు సంబంధించినవే! స్తుతిశ్లోక పంచకమున "తస్మై నమః శ్రీగిరివల్లభాయ" అనునది మకుటము.

సుప్రసిద్ధుఁ డగు కవిరాజ శిఖామణి, నన్నెచోడ దేవకవి తాను రచించిన 'కుమారసంభవ' కావ్యమును గురు వగు మల్లికార్జునునకు కృతినిచ్చుచు, తన గురువునకును, మల్లికార్జున దేవునకును అభేదమును వివరించెను.

ప్రసిద్ధ శైవకవి పాల్కురికి–సోమనాథుఁడు తన బసవ పురాణమునందును, పండితారాధ్య చరిత్రమునందును శ్రీ శైలమును ప్రశంసించి యున్నాఁడు. ఈ రెండింటి నీతఁడు శ్రీశై లమునం దుండియే రచించెను. బసవపురాణమునందు–

'సకల తీర్థములకు జనయిత్రి యగుచుఁ
బ్రకటింప నొప్పు శ్రీ పర్వతేంద్రంబు'

అని శ్రీ శైలము ప్రశంసింపఁబడినది. పండితారాధ్యచరిత్ర మునందు ఈ క్షేత్రమునుగూర్చి 'పర్వత ప్రకరణము' అను పేర ప్రత్యేక ప్రకరణమే కలదు. అందు శ్రీశైలమాహాత్మ్యము మున్నగు విషయములు విపులముగ వివరింపఁబడినవి.

చక్రపాణి రంగనాథకవి 'శ్రీగిరినాథ విక్రమము' అను నూఱు సీసపద్యముల గ్రంథమును రచించినట్లు తెలియు చున్నది. ఈరంగనాథుఁడు తొలుత వైష్ణవుఁడు: శివుని దూషిం చుటవలన కన్నులు పోఁగా, నితఁడా దేవుని స్తుతించి తిరిగి నేత్ర భాగ్యమును పొందెనఁట! ఈకవి పయిగ్రంథమునేగాక 'శివ భక్తి దీపిక రగడ, నమశ్శివాయ రగడ' అను రెండు మల్లి కార్జునస్తుతి రూపము లగు రగడలను కూడ రచించెనఁట!

శ్రీగిరి అనుకవి 'శ్రీగిరీశ' అను మకుటముతో నొక శతక మును రచించెనఁట! రావిపాటి - త్రిపురాంతకుఁడు రచించిన 'త్రిపురాంతకోదాహరణము'నందు శ్రీశైల ప్రశంసకలదు. ఈ యుదాహరణమునందు శ్రీశైలమునకుఁ గల నాలుగుద్వారము లలో నొకటి యగు త్రిపురాంతకమునందలి త్రిపురాంతక దేవుని స్తుతి కలదు.

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు రచించిన కాశీఖండ ములో అగస్త్యమహాముని చేసిన తీర్థయాత్రా సందర్భమున శ్రీశైలము విశేషముగా వర్ణింపఁబడినది. మఱియు శ్రీనాథుఁడు

శ్రీశైలక్షేత్రమునందుండియే శివరాత్రి మాహాత్మ్యమును రచించి నట్లు—

'స్వస్తి శ్రీ పర్వత స్వయంభూ శ్రీలింగ చక్రవర్తి శ్రీమన్మల్లికార్జున శ్రీమహాదేవుని ముఖమండపంబున సుఖాసీనులయి ......యుండ శ్రీశాంత భిక్షావృత్తి యతీశ్వరుండు శివకథా విధానంబులఁ బ్రొద్దులుపుచ్చుచుఁ దన మూలభృత్యుండగు పువ్వుల ముమ్మడి దేవయ్యశాంతునిం గనుంగొని...'

అను నవతారికాభాగమువలనఁ దెలియవచ్చుచున్నది. శ్రీశైలమునందలి భిక్షావృత్తి మఠాధ్యక్షుఁడగు శాంతభిక్షావృత్తి కోరిక ననుసరించియే శ్రీనాథుఁడు తన శివరాత్రి మాహాత్మ్యమును, ఆ యోగికి మూలభృత్యుఁడగు పువ్వుల శాంతయ్య కంకితమొనర్చెను. అనుపలబ్ధమగు శ్రీనాథుని పండితారాధ్య చరిత్రమునందును శ్రీశైలప్రశంస యుండి యుండునని యూహింపవచ్చును.

నాగలూటి - శేషనాథార్యుఁడు శ్రీశైలమాహాత్మ్యమును 'శ్రీపర్వతపురాణ' మను నామమున పద్యకావ్యముగా రచించి శ్రీమల్లికార్జునస్వామికే కృతి యిచ్చెను.

తెనాలి-శ్రీగిరి యను కవి 'శ్రీశైల మాహాత్మ్యము'ను పద్యకావ్యముగా రచించినట్లు తెలియుచున్నది.

తెలుఁగుదేశమునకు 'త్రిలింగ' దేశమను పేరు ప్రసిద్ధము. ఇది ఎల్లలనుబట్టి యేర్పడినట్లును, శ్రీశైలము, కాళేశ్వరము, దక్షారామము-అను మూఁడు క్షేత్రములకు నడుమ

నున్న దేశమే తెలుఁగుదేశ మైనట్లును, ఆ క్షేత్రములు మూఁడింటియందును శివలింగము లుండుటంబట్టియే దేశమునకు 'త్రిలింగ' దేశ మను నామ మేర్పడినట్లును తెలియుచున్నది.

విన్నకోట పెద్దయకవి రచించిన కావ్యాలంకార చూడామణియందు—

'క. ధర శ్రీపర్వత, కాళే
శ్వర. దక్షారామ సంజ్ఞ వఱలఁ ద్రిలింగా
కర మగుట నాంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనఁదగుఁ గృతులన్.

తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ
దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె'

(నవమోల్లాసము)

అని పై విషయము వివరింపఁబడినది. ఈ యంశమునే తర్వాతివాఁడగు అప్పకవియుఁ దన 'అప్పకవీయము'నఁ దెల్పి యున్నాఁడు. దీనివలన ఆంధ్రదేశమునకు 'త్రిలింగ' దేశ మను పేరు కలుగుటలో శ్రీశైలము ప్రాధాన్యమును వహించె నని చెప్పవలెను.

ఆంధ్రదేశమున ప్రతిగ్రామమును భ్రమరాంబాష్ట కము పారాయణ చేయఁబడుట సుప్రసిద్ధము. పెద్ద సమారాధ నలు జరుగునపుడు భోజన కాలమున దీనిని శ్రావ్యముగఁ జదువుచు అన్నపూర్ణాదేవిని స్తుతించు నాచారము నేఁటికిని

గలదు. ఆ పద్యములు ఎంతో ఇంపుగా నుండును. వానిలో ఒకదానిని గనుఁడు—

'అతిశయంబుగఁ గాశిలోపల అన్నపూర్ణ భవానివై
సాక్షిగణపతి కన్నతల్లివి సద్గుణావతి శాంభవీ,
మోక్షమొసఁగెడు కనకదుర్గవు మూలకారణ శక్తివీ
శిక్షచేతువు క్రూరజనులను శ్రీగిరి భ్రమరాంబికా!'

ఈ 'శ్రీగిరి భ్రమరాంబిక' శ్రీశైలముఁ గల భ్రమరాంబయే కాని వేఱొకతె కాదు.

ఆంధ్రగ్రంథములలో నేకాక సంస్కృతము, కన్నడము, తమిళము మున్నగు భాషలలో రచితములైన గ్రంథములలోఁ గూడ ఈ క్షేత్రము ప్రశంసింపఁబడినది. క్రీ. శ. 6,7 శతాబ్దులలోని తేవారము (తమిళగ్రంథము) లోను, సిద్ధనాగార్జునుని రసరత్నాకరము మున్నగు గ్రంథములలోను (సంస్కృతము) ఈ క్షేత్రప్రశంస కలదు. మఱియు హేమారెడ్డి-మల్లమ్మ పురాణము, రేవణ సాంగత్యము, శివరాత్రి మహిమ, రేణుక విజయము, అక్కమహాదేవి రగడ మున్నగు కన్నడ గ్రంథములలోను ఈ క్షేత్రమహిమ వివరింపఁబడినది. కావున దక్షిణదేశ వాఙ్మయమునకు శ్రీశైల క్షేత్రము మిక్కిలి పరిచితమైనదే యని చెప్పవలెను.

---

# రససిద్ధుల యుదంతము

శ్రీశైలము యోగులకును, మహాభక్తులకును నివాస మైనట్లే సిద్ధులకు నునికిపట్టయి యుండెడిది. ఇచటి పర్వతములపై అద్భుతశక్తులు కల వనస్పతులు, అభ్రకము, తాళకము, మణిశిల, రాతిపువ్వు, రాతినార, శిలాజిత్తు, స్ఫటికము, లోహము, కాంతము ఉన్నవి. వైద్యులు, సిద్ధులు, అపూర్వము లగు సాధనలు చేసి, వీనివలన గొప్ప లాభములను పొందుచుండెడివారు.

శ్రీనాథుఁడు కాశీఖండమున నీక్షేత్రమును వర్ణించుచు, '...రససిద్ధి, రసాయనసిద్ధి, మూలికాసిద్ధి, పాదుకాసిద్ధ్యాదులగు సిద్ధిక్షేత్రంబులచేతను శోభితంబై దివ్యామృత నిర్మల శ్రీ స్వయంజ్యోతిర్లింగమూర్తి యగు మల్లికార్జున శ్రీమన్మహాదేవునకు నిలనివాసంబై యభిరామంబై దివ్యంబు నగు శ్రీశైలంబుఁ జేరవచ్చె...' అని సిద్ధులవిషయమును తెల్పినాఁడు.

సిద్ధనాగార్జునుని కాలమున ఈ క్షేత్రము సిద్ధులకుఁ జేరుపడినది. వారి పరిశోధనశాల లిందే యుండిన ట్లూహింప వీలగుచున్నది. వారు కాయకల్పము మున్నగు రాసాయనిక పద్ధతులమూలమున శరీరమునకు దృఢత్వమును, మనోనిగ్రహమును, ఇంద్రియస్వాధీనతను, ఆయుర్వృద్ధిని సాధించెడి

వారు. ఇంతేకాక వాయుగమనము, స్వేచ్ఛాగమనము మున్నగు అసాధ్యకార్యములను నెఱవేర్చెడివారు.

సిద్ధనాగార్జునుని కక్షపుటము, నిత్యనాథుని రసరత్నాకరము మున్నగు తాంత్రికగ్రంథములలో రాసాయనిక పద్ధతులు, సిద్ధిప్రాప్తి విధానములు, ఆయుర్వృద్ధికరము లగు చికిత్సలు, ఆకాశగమనాది పద్ధతులు, వీర్యవృద్ధి, జ్ఞానవృద్ధి మున్నగు వృద్ధులు సులభోపాయముగను, అందరికిని అందుబాటులో నుండునట్లును వివరింపఁబడినవి. సిద్ధులు తమ పరిశోధనలమూలమున తేలిన సారాంశమును లోకహితార్థము గ్రంథస్థము చేసియున్నారు. ఆయావిషయము లిప్పుడు మనకుఁ గొంత ఆశ్చర్యమును కలిగించుచున్నను, ప్రాచీనకాలమున—ఆ పద్ధతులు ఫలవంతములై యుండెనని విశ్వసింపవచ్చును.

నిత్యనాథుని రసరత్నాకరమునందలి రసాయన ఖండములో శ్రీశైలక్షేత్రము రాసాయనిక పరిశోధనాగారమైనట్లును, పరిశోధకులకు నిలయమైనట్లును చెప్పబడియున్నది. శ్రీశైలమునందలి చెట్లు, మన్ను, దుంపలు, జలములు మున్నగున వన్నియును మానవ కల్యాణప్రదము లనియు, ఎక్కువ ఉపయోగకరము లనియు నందే యున్నది. మఱియు రసఖండము లున్న తావులును, వానిని గుర్తించు విధానములును, ఉపయోగించు పద్ధతులను విపులముగ నందే వివరింపఁబడినవి.

కాని, ప్రాచీనకాలమున వాని నెవ రెవ్వ రే యే విధముల నుపయోగించుకొనిరో! వివరముగా మనకుఁ దెలియదు.

అట్టి యమూల్యవస్తుసంపద సరియైన యుపయోగమునకువచ్చినచో ఆంధ్రదేశమే కాక భారత దేశమంతయు నెంతో యభివృద్ధికి రాఁగలదని చెప్పవచ్చును. శ్రీశైలక్షేత్రమును పునరుద్ధరింపఁ బూనుకొనిన ప్రభుత్వమువారు ఈ విషయమునఁ గూడ తగిన శ్రద్ధ వహించి, ఇచట నొక పరిశోఘన కేంద్రమును స్థాపించి, వస్తుశాస్త్రమునను, భూగర్భశాస్త్రమునందును ఆఱితేఱిన పరిశోధకులను నియమించి చక్కని పరిశోధనలు జరుగుట కవకాశమును కల్పింపవలసియున్నది.

---

# పూర్వపుమార్గములు

శ్రీశైలక్షేత్రము దుర్గమములైన కొండలపైనుండుట వలనను, అచటికి అరణ్యమార్గమునఁ బోవలసియుండుటవల్లను యాత్రికులు సులభముగా నచటికిఁ బోవుట కష్టము. ఉత్సవ సమయములందుఁగూడ జను లసంఖ్యాకముగాఁ బోయి స్వామి దర్శనము చేసికొనుట సాధ్యమయ్యెడిది కాదు.

ఇదివఱలో నిచటికి నలుదిక్కులనుండియు నాలుగు మార్గములమూలమునఁ బోయెడివారు. తూర్పునుండి రైలులో వచ్చువారు మార్కాపురంరోడ్డు స్టేషనులోదిగి, అక్కడినుండి దోరణాలవరకు పోవలెను. దోరణాలకు మార్కాపురము స్టేషనునుండి 28 మైళ్లు. దోరణాలనుండి 'చింతల' అను గ్రామమువఱకును పదిమైళ్లు 'ఫారెస్టురోడ్డు' (అడవిబాట) కలదు. దీనిపై బస్సులు వెళ్లవు. ఎద్దుబండ్లు మాత్రము పోవును. 'చింతల'కు 20 మైళ్లదూరములో క్షేత్ర మున్నది. చింతలనుండి నడిచి వెళ్లవలసినదే! చింతల దాటినతర్వాత ఆఱుమైళ్లకు చిన్నారుట్ల వచ్చును. అది యొక మజిలీ. అక్కడి నుండి ఆఱుమైళ్లుపోఁగా పెద్దారుట్ల వచ్చును. అది మఱియొక మజిలీ. ఆపైని హాటకేశ్వరము, శిఖరేశ్వరము అను రెండు మజిలీలు కలవు. పిదప దేవస్థానము వచ్చును. ఇచటికి నడిచి పోలేనివారు డోలీల నేర్పఱచుకొనవచ్చును. స్వారిచేయగల వారు గుఱ్ఱములపైఁ బోవచ్చును.

పడమటనుండియు, దక్షిణమునుండియు వచ్చువారు కర్నూలునుండిగాని, నంద్యాలనుండిగాని బస్సులో ఆత్మకూరు చేరవచ్చును. ఆత్మకూరునుండి నాగలూటిమీదుగా పెద్ద చెరువు చేరవలెను. ఆత్మకూరునుండి యిచ్చటికి 26 మైళ్ళు. పెద్దచెఱువువఱకును రోడ్డు కలదు. అంతవరకును బండ్లపై పోవచ్చును. పెద్దచెఱువునుండి శ్రీశైలము పదిమైళ్ళు. ఈపది మైళ్ల దూరము నడువవలెను. లేదా డోలీలను కుదుర్చుకొని వచ్చును.

• ఉత్తరమునుండి–అనఁగా హైదరాబాదు ప్రాంతము నుండి వచ్చువారు నాగరకర్నూలు, అమదాబాదు, తెలక పల్లి, శ్రీశైలమున కుత్తరద్వారమైన ఉమామహేశ్వరము, వటర్లపల్లి – అను స్థలముల మీఁదుగా కృష్ణానదిని జేరి, దానిని దాఁటి శ్రీశైలమును జేరవచ్చును. ఇంచుమించుగా నీ మార్గ మంతయును కాలిబాటయే!

సాధారణముగా యాత్రికులు దోర్ణాలవరకును బస్సుపై వచ్చి, యచటినుండి పెద్దచెఱువునఱకును బండ్లపై పోయి, మిగిలిన పదిమైళ్లను నడచిపోవుచుండెడివారు! మార్గము మహారణ్యమధ్యమునుండి యుండుటచే జంతు భయము, దొంగల భయము నుండవచ్చును. అందువలన చెంచువాండ్ర సాహాయ్య మావశ్యకమయియుండెడిది.

యాత్రికు లిచ్చట అన్నిమార్గములలోను చెంచు వాండ్రకు జెల్లింపవలసిన కట్టడ గలదు. ఒక్కొక్క యాత్రి కుఁడును రెండేసి అణాలవంతున వారికిఁ జెల్లింపవలెను. దానిని

చెల్లింపనియెడల వారొక్క యడుగైనను ముందునకుఁ బోనీయరు. దీనికిఁ బ్రతిఫలముగ వారు సంవత్సరకాలము ఆ పరిసరములను కనిపెట్టుకొని యుండి జంతువులవలనఁ గాని, దొంగలవలనఁగాని యాత్రికుల కెట్టి యుపద్రవములు కలుగ కుండఁ జూచుచుందురు.

ఉత్సవదినములలో నీమార్గములందు చలిపందిళ్ళు, అన్నసత్రములు ఏర్పాటు చేయఁబడుచుండును.

నడిచి ప్రయాణముచేయుటకు శ్రమ యని అనిపించి నను, దారిపొడుగునను సుందరదర్శనములు మనస్సున కెంతో యానందమును గలిగించును. ప్రయాణాయాసమును విస్మరింపఁ జేయును.

పెద్దచెఱువునుండి ఆఱుమైళ్ళు ప్రయాణముచేయగాఁ 'భీముని కొలను' వచ్చును. నిజమున కిది కొలను కాదు; ఇరు వదిమూరలపొడవు, నాలుగైదు మూరల వెడల్పును గల యొక సన్నని దొన! ఈ మార్గమున వచ్చు పాంథులు దప్పితీర్చు కొనుట కిదియే యాధారము! ఇది అగాధమైన లోయలో నున్నది. ఈకొలనికి దిగుటయు, ఎక్కుటయు కొంత ప్రమా దకరమైనది. ఇక్కడికి శ్రీశైల మింకను నాలుగుమైళ్ళుండును. ఇక్కడినుండి ఉత్తరముగా ప్రయాణము సాగించవలెను. పిదప చుక్కలపర్వతము-లేక నక్షత్రపర్వతము వచ్చును. ఇది మిక్కిలి యెత్తయినది. రెండుమైళ్ళు నిటారుగా ఎక్కవలెను. చుక్కల నంటునట్లుండు పర్వత మగుటచే దీని కీపేరు వచ్చి యుండును. లేదా ఎక్కువారికి శ్రమవలన చుక్కలు కనఁ

బడిన ట్లుండినందున, ఈపేరు వచ్చియుండు ననియు నూహింప వచ్చును. సూతిలోఁబడిన వస్తువును మీఁదికి చేదినట్లే తమ్ము మీఁదికి తీసికొని పోవలెనని భక్తులిచ్చట శ్రీమల్లికార్జున స్వామిని ప్రార్థించుట పరిపాటి. ఈ కొండ నెక్కునపుడు ప్రజలు పడు శ్రమలను, చేయు ప్రార్థనలను పాల్కురికి సోమ నాథకవి తన 'పండితారాధ్య చరిత్రము'న చక్కఁగా వర్ణించి యున్నాఁడు—

'చిక్కుచు మోఁకాళ్ల జేతు లూఁదుచును

.........................

వంగుచు వ్రాలుచు త్రొంగుచుఁ జనుచు

.........................

చేసుకో మల్లయ్య చేదుకొ మ్మనుచు
గనుకని పాటలఁ గట్టి పాడుచును.'

భక్తులు నక్షత్రపర్వతము నెక్కుదురఁట!

చుక్కలపర్వతము నెక్కునపు డెంతో జాగ్రతగ నుండ వలెను. పడిపోకుండ – జాఱకుండ – ఎగుడు దిగుడు మెట్లపయి భద్రముగ పాదము లుంచి, శ్రమపడి కొండ యెక్కఁగా, ఒక మైలుదూరము క్రిందికిదిగవలసియుండును. అట్లు దిగఁగా–త్రిపు రాంతకమునుండి వచ్చు మార్గ మీమార్గమునఁ గలియును. కొంచెముదూరము సమతలముపైఁ బ్రయాణము చేయఁగా శ్రీ శైలపు కోట కానవచ్చును. ఇక్కడినుండి చూడఁగా ఉత్తర మున బ్రహ్మగిరి, విష్ణుగిరులు, తూర్పున శిఖరేశ్వర, హాట

కేశ్వరములు, దక్షిణమున భీమునికొలను, లోయలో లోతుగా ప్రవహించుచున్న కృష్ణాస్రవంతిలోఁ గలియు సెలయేరు ఎంతో రమణీయముగాఁ గానవచ్చి, ఆనందమును కలిగించుచుండును. ఈదృశ్యములు చూచినంతనే-ఇంతవఱకు వచ్చుటలోఁ బడిన శ్రమ యంతయు మఱపునకు వచ్చును.

1957–వ సం. నవంబరు 24–వ తేదీని దోరణాలనుండి శ్రీశైలమునకు వేయబడిన రోడ్డు తెరువఁబడువఱకును పయి రీతిని యాత్రికులు శ్రమపడవలసి వచ్చెడిది. ఆ దినమున (ఆదివారమున) ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి శ్రీ నీలం — సంజీవ రెడ్డిగారీమార్గమును ప్రయాణములకుఁ దెఱచిరి. బస్సులు కూడ సక్రమముగ నీమార్గమున నడుచు నేర్పాట్లు చేయఁ బడినవి.

# నూతన మార్గము

తిరుపతినుండి తిరుమలకు రోడ్డు సౌకర్యము కలిగించి నట్లే దోరణాలనుండి శ్రీశైలమునకు రోడ్డు నిర్మించి యాత్రి కులకు మహోపకార మొనర్పవలె నను సంకల్పము కొన్ని యేండ్ల క్రిందటనే ఆంధ్ర ప్రధానామాత్యులు శ్రీ సంజీవరెడ్డి గారికిఁ గలిగినది. ఆయన కేంద్రప్రభుత్వముతో సంప్రతించి, వారి సౌజన్యముతో శ్రీశైల ద్వారమువఱకును రమారమి ముప్పది రెండు మైళ్ల మార్గమును నిర్మింపఁగలిగిరి. దీనికై ఇంచుమించుగా ఇరువదిలక్షల రూపాయలు వ్యయమైనవఁట!

సాధారణమైన రోడ్డును నిర్మించుటయే ఎంతో శ్రమ సాధ్యమగు పని. అట్టియెడ కొండలపై - ఏమాత్రపు స్వల్ప ప్రమాదమైనను కలుగకుండ-నియమితకాలములో నీ మార్గ మును నిర్మించిన ఇంజినీర్ల ప్రతిభ ప్రశంసనీయము! తా మీ కార్యమును నిర్వహించుటలో దైవబలమే ఎక్కువ పనిచేసి నట్లు ఇంజినీర్లే విశ్వసించుచున్నారు.

పని ప్రారంభించుటకు ముందు వారు తమ సొంత సొమ్ముతో విఘ్నేశ్వరున కొక చిన్న ఆలయమును నిర్మించి, తమ ప్రయత్నమును నిర్విఘ్నముగా కొనసాగింపవలెనని యా వినాయకునికి మ్రొక్కుకొనిరి. అట్లు చేయుటవల్లనే తమ కార్యక్రమమున కెట్టి యాటంకములుగాని, ఎట్టి ప్రమాద

ములు గాని కలుగలేదని వారు చెప్పుచున్నారు. వంకర టింకరగా నుండు మార్గమును సరిచేసి, చక్కని రోడ్డు నిర్మింపబడిన పిదప, చూచుటకా ఇంజనీర్లకే ఆశ్చర్యము కలిగినదఁట!

ఈ మార్గమును నిర్మించునపుడు ప్రకృతిశోభ మఱుగు పడకుండ—సుందర దృశ్యములు దారిపొడుగున కానవచ్చునట్లు కళావేత్తలగు వాస్తుశాస్త్రజ్ఞులు తగిన శ్రద్ధ వహించిరి. అందువలన పాతాళ గంగ, ఆలయశోభ మున్నగు దృశ్యములు దారి పొడుగునను చూడ వీలగును.

యువకులగు ఇంజినీర్లు నిర్మలహృదయముతో, సత్సంకల్పముతో పొదుపుగా తమ ధర్మమును నెఱవేర్చుటవలన రోడ్డునిర్మాణమునకు ప్రత్యేకింపఁబడినసొమ్ములో రెండులక్షల రూపాయలను మిగుల్పఁగలిగిరి. వారు, తమ నివాసగృహములకై యిచ్చిన సొమ్ములో సగము మిగిల్చి, ఆధునిక సౌకర్యములు లేని గృహములలో — అనారోగ్యకరములగు స్థలములలో నివసించుచు, రెండేండ్లలోపుగనే యీ పనిని ముగించిరి. రెండు లక్షలు పొదుపుచేసి, పాతాళగంగకు రోడ్డు వేయుటకుఁ గల అవకాశమును కూడ ప్రభుత్వమునకు సూచించిరఁట!

దోరణాలలో శ్రీశైలపురోడ్డు ప్రారంభమైనచోట నూతనముగా నిర్మింఁపబడిన వృషభధ్వజము కలదు. పట్టణ ప్రణాళికల శాఖ సహాయ—డైరెక్టరు శ్రీ రమణారెడ్డిగారు దీని డిజైనును తయారుచేసిరఁట! దేవాలయ శోభకుఁ దగినట్లుగా ఈధ్వజ మెంతో ఆకర్షణీయముగా నుండును.

ఎదురుగా వృషభము శిల్పకళ ఉట్టిపడునట్లు కలదు. దాని వెనుక స్తంభము! దానికిరువైపుల పాలరాతిపద్మములు కలవు. వానిపయి రోడ్డునకు ప్రారంభోత్సవము జరిపిన ముఖ్యమంత్రి యొక్కయు, రహదార్ల శాఖకు మంత్రి శ్రీ మందుముల-నరసింగరావుగారియొక్కయు, ఇంజనీర్లయొక్కయు పేర్లు లిఖింపఁబడి యున్నవి.

ఈ మార్గనిర్మాణము యాత్రికులకు సౌకర్యమును కలిగించుటయేగాక - కొందఱు జనుల జీవితములో గొప్ప మార్పును కలిగించి వారి యభ్యున్నతి కెంతో తోడ్పడినది. సర్వసాధారణముగా సోమరులై, వ్యర్థముగా కాలము గడపుచున్నట్టి చెంచుకులస్థులకు దీనివలన చేతినిండుగా పనిదొరికినది. రహదారి శాఖలోని యుద్యోగులు వారిని ప్రోత్సహించి రాళ్లు పగులఁగొట్టుట మున్నగు పనులు నేర్పిరి. దానితోపాటు మిగిలిన పనులను వారు నేర్చుకొనిరి. దీనివలన-కష్టపడి పని చేసి, జీవించు పద్ధతికి వారలవాటుపడి, అభ్యుదయమార్గముల ననుసరింపఁగలరు.

చారపప్పు, వెదురు, తేనె మున్నగు వస్తువులు పర్వత ప్రదేశములలో విరివిగా లభించును. కాని, ఇంతకాలము రోడ్డు లేనందున, వానిని వ్యాపారదృష్టితో రవాణాచేయుట

కవకాశము లేకపోయినది. ఈరోడ్డుమూలమున వాని నితర స్థలములకును రావాణాచేయుట సులభ మగును. మఱియు నిట్లు రాజమార్గ మొకటి ఏర్పడినందున నిర్మానుష్యము లగు ప్రదేశములు వాసయోగ్యములై జనసంచారమున కలకలలాడుచు నుండఁగలవు.

దోరణాలనుండి శ్రీశైలమునకు రోడ్డును నిర్మించినట్లే కృష్ణానది కవతలితట్టున – హైదరాబాదు ప్రాంతమునుండి కూడ 40 మైళ్ల మార్గమును నిర్మించుటకు ప్రభుత్వము నిశ్చయించినది. ఆప్రాంతమున మన్ననూరినుండి నీలగంగ వఱకును రోడ్డు వేయఁబడును. దీనికి 17 లక్షలు వ్యయ మగునఁట! ఆ రోడ్డు తెలంగాణములోని పాలమూరు మండలమునందలి అమ్రాబాద్ కొండల నడుమనుండి ఫర్హాబాద్ మార్గముగా నీలగంగ చేరఁగలదట! ఈరోడ్డు నిర్మింపఁబడినయెడల, ఉత్తరప్రాంతములనుండి వచ్చువారు చుట్టుదారిని శ్రమపడి రా నవసరము లేకుండును.

దోరణాల-శ్రీశైలం రోడ్డు తెరువఁబడుటతో బస్సులు నడుపుటయు ప్రారంభమైనది. దోరణాలనుండి శ్రీశైలమునకు టిక్కెట్టు రెండురూపాయలు. మార్కాపురమునుండి వచ్చువారీక్రింది వేళలను గమనించి ప్రయాణము చేయవచ్చును.

# బస్సు వేళలు

| | | | గం. | ని. |
|---|---|---|---|---|
| 1. | మార్కాపురంరోడ్డునుండి బయలు దేరు వేళ | ఉదయము | 7 | 0 |
| 2. | మార్కాపురము చేరువేళ | ,, | 7 | 15 |
| 3. | మార్కాపురమునుండి బయలుదేరు వేళ | ,, | 8 | 30 |
| 4. | తోకపల్లి చేరువేళ | ,, | 8 | 45 |
| 5. | తోకపల్లి విడుచువేళ | ,, | 8 | 50 |
| 6. | దోరణాల చేరువేళ | ,, | 9 | 20 |
| 7. | దోరణాల విడుచు వేళ | ,, | 9 | 30 |
| 8. | శ్రీశైలము చేరువేళ | ,, | 10 | 45 |

కర్నూలు వైపునుండి వచ్చువారును దోరణాలవఱకు వచ్చి, అచ్చటనుండి శ్రీశైలమునకుఁ బోవచ్చును.

---

# ప్రధాన దేవాలయములు

శ్రీశైలక్షేత్రము మిక్కిలి విస్తృతమయి యున్నది. కావున అచట పెక్కు దేవాలయము లుండుట వింత కాదు. కాని వానిలో శ్రీమల్లికార్జున దేవాలయము, శ్రీ భ్రమరాంబా దేవాలయము ముఖ్యమైనవి.

పర్వతముమీఁది సమప్రదేశమునకు రాఁగానే కోట ద్వారము, గోడలు కానవచ్చును. గోడలుమిక్కిలిదళసరిగను, 20 నుండి 26 అడుగుల యెత్తుగలవిగను ఉండును. అవి యించుమించు ఏడడుగుల పొడవు, మూఁడడుగుల ఎత్తు గల నలుచదరపు నల్లరాళ్లతో నిర్మింపఁబడి యుండును. గోడల మీఁద అనేక విగ్రహములు చెక్కఁబడినవి. అవి శిల్పకళా వైశిష్ట్యమును వ్యక్తముచేయుచుండును. దానికి ఎనిమిది మూలలలోను అష్టభైరవులు ప్రతిష్ఠింపఁడి యున్నారు. దీనినిబట్టి యిచ్చటఁ బూర్వము వీరశైవము మిక్కిలి ప్రబలమయి యుండినట్లూహింపవచ్చును. పూర్వమిచ్చట భైరవాగమ విధానము ననుసరించి యర్చనలు జరుపఁబడుచు నుండవచ్చునని తోఁచుచున్నది.

దీనికి పడమటివైపుననే కొంచెము దూరములో పంచమఠములు నున్నవి.

కొంచెము దూరము పోవుసరి కాలయప్రాకారము కానవచ్చును. ఇది నాల్గు వైపులను 22 అడుగుల ఎత్తు గలిగి యున్నది. అది తూర్పు, పడమరలకు 510 అడుగులును, ఉత్తర, దక్షిణములకు 600 అడుగులను వైశాల్యము కలిగి యున్నవి. ఉత్తర, దక్షిణముల వైపునను, తూర్పువైపునను గోపురము లున్నవి. పడమటితట్టున మాత్రము గోపురము లేదు. గుహ్యములు పెక్కు శిల్పముతో ఆకర్షణీయములుగ నున్నవి.

దేవాలయములకు—ఒక దానిలో నింకొకటి—రెండు ఆవర ణాలు కానవచ్చును. మొదటి యావరణాలో పడమ వైపున యాత్రికుల బసలు, కుష్ఠిరోగివారి యాస్థానము, ఎత్తుగా భ్రమ రాంబాలయము కానవచ్చును. కుడి వైపున శిలామండపము, దాని నానుకొని దేవస్థానమువారి కార్యాలయము కలవు.

ఈ మొదటి యావరణమునందే ఉత్తరదిశను పెద్ద శైవ సత్ర మున్నది. పూర్వకాలమున దానిముందొక కొలను ఉండెడిదట! ఇప్పుడది కప్పివేయఁబడినది. ఆ కొలనులో నంత ర్వాహిని కలదనియు, కొలనిని పూడ్చివేయుటచే దాని కవ రోధము కలిగినదనియు, అందువలన గోడలు బ్రాలుచున్నవని యును పరిశోధన లొనర్చిన ఇంజినీర్లు చెప్పుచున్నారు.

ప్రాకారమునకు వెలుపల ఏనుఁగుల కొలను మున్నగు మూఁడు కొలఁకు లున్నవి. యాత్రాదినములలో గొట్టముల ద్వారా వీనినుండి మంచినీరు సరఫరా చేయఁబడుచుండును.

భ్రమరాంబికగుడి చాల చిన్నది. దాని మండపము, ఆవరణముకూడ చిన్నవే! ఆలయము తూర్పుముఖమై యున్నది. ఆలయ స్తంభముల మూలభాగములందు నట్టువకత్తెల చిత్తరువులును, వీరభటుల చిత్రములు చెక్కఁబడియున్నవి. దుర్గాదేవి చిత్రములును చాల ఉన్నవి. ఇది చాల ప్రాచీనమైన దేవాలయము. దీనిని నిర్మించినతర్వాతనే దేవాలయ ప్రాకారము నిర్మింపఁబడినట్లు తోఁచుచున్నది. దేవికి బ్రాహ్మణులే అర్చకులు!

అంతరావరణమున — అనఁగా రెండవ యావరణలో నడుమ శ్రీమల్లికార్జునస్వామి దేవాలయము కలదు. ప్రాకారము లోభాగమున చుట్టును కొన్ని మండపములును, పూజారుల గృహములును గలవు. మల్లికార్జునుని పూజారులు జంగములు.

మల్లికార్జున దేవాలయముకూడ చిన్నదే! అది రాతితో నిర్మింపఁబడినది. గర్భగుడి పది చదరపుటడుగుల వైశాల్యము కలిగియుండును. దాని నడుమ మల్లికార్జున లింగ మున్నది.

ఆలయమునకు ముందు మూఁడువైపుల వరండాలు కల ముఖమండప మున్నది. దీనిని-విజయనగర ప్రభువగు రెండవ హరిహరరాయలు కట్టించెను. ఈ మండపములో కొన్ని పెద్ద రాతి గుహ లున్నవి. మండపము గోడలపైని, స్తంభముల పైని చక్కని శిల్పములు కలవు. దీని నాలుగు మూలలందును, నడుమను నందివిగ్రహములు కలవు. మఱియు ప్రధాన దేవాలయమున కెదురుగను, తూర్పుగను రెండు మండపములు

కలవు. అందొకటి వీరమండపము. పూర్వ మిచట భక్తులు కొందరు తమ కోరికలు నెఱవేఱుటకు నాలుకలు కోసికొనుట మున్నగు సాహసకృత్యముల నొనర్చుచుండెడివారఁట! ఒక మండపమున పెద్ద నందివిగ్రహము కలదు. ఇందు శిలాశాసనములు పెక్కులు కానవచ్చుచున్నవి.

ఆలయమునకుఁ బశ్చిమముగా అందమైన శిలా బలిపీఠ మొకటి యున్నది. ఉత్సవవిగ్రహములకు ఉత్సవములు, పూజలు, నైవేద్యములు ఇచ్చటనే జరుగునఁట!

ఈ బలిపీఠమునకుఁ బశ్చిమముగా 'వసంత మండప' మను నొక మండప మున్నది. భ్రమరాంబా, మల్లికార్జున విగ్రహముల నిచ్చటికి ఊరేగింపుగా- తెప్పతిరునాళ్లకు తీసికొని వత్తురు. ఈ మండపములో-రాతితోఁ గట్టఁబడిన క్రీడా సర స్సొకటి కలదు. దాని నడుమ నొక మండపము కలదు. ఇప్పు డీసరస్సు పూడిపోయినది. కాని, పూర్వము ఈ పర్వతమువిూఁది యొక జలధారతో దీనిని నింపెడివారఁట!

ముఖమండపమునకుఁ దూర్పువైపున నింకొక శివాలయము కలదు. దానినే సహస్రలింగ దేవాలయ మని యందురు. మూఁడు పడగల నాగపీఠముపై ఈ లింగము ప్రతిష్ఠింపఁబడి యున్నది.

ఈ ప్రాకారపు గోడల నానుకొని అర్చకులు మున్నగు వారికి నివాసము లేర్పఱుపఁబడినవి. ఉత్తర, దక్షిణ దిగ్భాగములందును, నైరృతి, ఈశాన్యమూలలందును యాత్రికుల

సౌకర్యార్థమై కొన్ని బావులు కలవు. వీనికి 'పాతాళ బావు' లని పేరు. విష్ణుదేవుని యంశము గల సూర్యభగవానుని కిరణములు నీటిలోఁ బ్రసరింపకుండ – పూర్వము వీరశైవులు వీనికి మూతలు వేసి, తాళాలు బిగించెడివారఁట! అందువలననే వీనికి 'తాళాల బావు' లను పేరు కలిగినదఁట!

---

# ఇతర దృశ్యములు

శ్రీశైలక్షేత్రమున భ్రమరాంభా, మల్లికార్జునుల దేవాలయములే కాక చూడఁదగిన దృశ్యము లనేకము లున్నవి. వానిలో భీముని కొలను, పాతాళగంగ, పాలరాతినంది, శ్రీశైల దుర్గపరిసరములు మున్నగునవి ముఖ్యమైనవి.

భీముని కొలను !—దోరణాలనుండి శ్రీశైలమునకుఁ బోవు మార్గముననే—క్షేత్రమునకు నాలుగుమైళ్ల దిగున—రెండు కొండల నడుమ – అగాధమైన లోయలో నొక మడుగు కానవచ్చును. దానికే 'భీముని కొలను' అని పేరు. ఒక కొండ సెలయేరు దీని మూలముగాఁ బ్రవహించుచుఁ బడమట కృష్ణానదిలోఁ గలియును. దిగి ఇక్కడికి పోవుటయు, మీఁది కెక్కుటయుఁ గూడ శ్రమసాధ్యములే !

దీనికి 'భీముని కొలను' అని పేరు వచ్చుటకుఁ గారణము లేకపోలేదు. పూర్వము పాండవులు వనవాసము చేయునప్పుడీ ప్రాంతమునకు వచ్చిరఁట ! ఈ స్థలమునకు వచ్చుసరికి భీమునికి దప్పిక యధికముగాఁ గలిగెను. త్రాగుటకుఁ జుట్టు ప్రక్కల నెక్కడను జలము లభింపకపోయెను. అందువలన నతఁడు కోపించి నేలపై తన గదతోఁ గొట్టి యీ మడుగును కల్పించెనఁట !

ఇచటి దృశ్యములు రమణీయముగా నుండును. ఇక్కడి రెండు కొండలను గలిపి, యొకవంతెనను నిర్మించు నాలోచన ప్రభుత్వమున కున్నదఁట!

పాతాళగంగ :—స్వామి సన్నిధికి రమారమి రెండు మైళ్లదూరమున లోయలో కృష్ణానది ప్రవహించుచుండును. అదియే యిచ్చట 'పాతాళగంగ' అని పిలువఁబడును. మిక్కిలిలోఁతుచోటఁ బ్రవహించుటచే ఈ పేరు వచ్చియుండు నేమో! ఇది యెంతో పవిత్రమైన తీర్థముగా ప్రసిద్ధము. పాపాత్ములు తన్నంటి స్నానముచేయుటవలన, వారి పాపము లన్నియును గంగానది కంటెనవనియు, ఆ పాపములను పోఁగొట్టు కొనుటకై భాగీరథీ నదీమతల్లి యీ పాతాళగంగలో మునిఁగెననియు ప్రసిద్ధి.

ఇచటికిఁ బోవుటకు తొమ్మిదివందల మెట్లు దిగవలెను. ఇవి మిక్కిలి యెత్తుగా నుండును. కావున దిగునపు డెంతో జాగరూకత వహింపవలెను. విజయనగరప్రభు వగు కృష్ణదేవ రాయలు కట్టించిన మండపములు కొన్ని మార్గమున కిరు వైపులను గలవు. ఇక్కడినుండి చూచినచో - త్రిమూర్తుల పర్వతముల నడుమనుండి - అనఁగా - బ్రహ్మ, రుద్ర, విష్ణు గిరులమధ్యనుండి మందయానముతో కృష్ణాస్రవంతి ప్రవహించు సుందరదృశ్య మెంతో హృదయంగమమైయుండును. ఈ ప్రాంతమున యాత్రికులు కూరుచుండి ప్రకృతిశోభను దిలకించుట కనువుగాఁ గొన్ని వేదికలు ఈ నడుమనే నిర్మింపఁ బడినవి.



బ్రహ్మ విష్ణు మహేశ్వరులు

(వీరి పేరిట మూఁడు పర్వతము లీక్షేత్రమునఁ గలవు)



శివాజీ మందిరము

(ఇది దేవాలయమునకు 3 ఫర్లాంగుల దూరమున నున్నది)

శ్రీశైల శిఖరమునకు ముందుభాగమున నొక పాల రాతి నంది యీ నడుమనే ప్రతిష్ఠింపఁబడినది? అది ఎంతయు నాకర్షణీయముగ నున్న కళాఖండము. దానిని దేవాదాయ, ధర్మాదాయ శాఖ డిప్యూటీ కమీషనరు శ్రీ జి. ఎస్. ఎన్. రామమూర్తిగారు సంపాదించినారఁట! దేవదాయ, ధర్మాదాయశాఖ కమీషనరు శ్రీ పైడి - లక్ష్మయ్యగారు దీనిని ప్రతిష్ఠించినారు. దీని కొమ్ముల నడుమనుండి శ్రీశైలాలయ దృశ్యమును జూచుట కనువుగా దీనిప్రతిష్ఠ జరిగినది. ఇక్కడి నుండి చూచినచో పాతాళగంగా స్రవంతికూడ మఱొకవంక హృదయాకర్షకముగాఁ గానవచ్చును.

ప్రధాన దేవాలయమునకు వాయవ్యదిశను మైలుదూరములో విభూతిమఠము, సిద్ధుల మఠము, నందుల మఠము, ఘంటాకర్ణ మఠము, సారంగధరమఠము–అను నైదుమఠములు కలవు. మఱియు నీ క్షేత్రమున పాండవుల ఆలయములు, శిథిలమైన జగద్గురు పండితారాధ్యుల పీఠము, అన్నపూర్ణాలయము, కుమారస్వామిగుడి, రాజరాజేశ్వరీ దేవాలయము, అంబాలయము శివాజీమందిరము మున్నగు దృశ్యములుకలవు. త్రిమూర్తుల పేరిట వెలసిన గిరులును దర్శనీయములే! ఇవికాక ఇంకను–అసంఖ్యాకములగు దేవాలయములు, తీర్థములుకలవు.

ఇచట శైవపీఠములకుఁ బ్రత్యేక వైశిష్ట్యము కలదు. శైవ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీజగద్గురు పండితారాధ్య సూర్యసింహాసన పీఠాధిపతులకు ఇచట ప్రత్యేక మర్యాదలు కలవు. పరమశివభక్తులగు శ్రీస్వామివారు శ్రీశైలమునకుఁ బూర్వపు

ఔన్నత్యమును గూర్చుటకు సర్వవిధముల యత్నించుచు న్నారు. ఆయన శ్రీశైల జీర్ణోద్ధరణసంఘ కార్యనిర్వాహకులు!

శ్రీపర్వత పురాణమునందలి వర్ణములనుబట్టి త్రిపు రాంతకము వైడూర్య శిఖరము; ఇందు దేవేంద్రుడు నివసించును; పశ్చిమశిఖరము బ్రహ్మేశ్వరము; ఇందు బ్రహ్మ నివసించును. మహేశ్వరము మాణిక్యశిఖరము, ఇది మర్త్య గణములచే సేవింపబడునది; పుష్పశైల శిఖరమున ప్రవా ళము లుండునట! స్కందసోమేశ్వరము రౌప్యశృంగము; ఇందు కుమారస్వామి నివసించును. దేవముని గణములచే సేవింపబడునది హేమశృంగము. అహోబలము మరకత శిఖరము. ఇందు విష్ణుదేవుడు నివసించును. నందిమండలము వజ్రశృంగము. ఇది నందీశ్వరుని నివాసము.

ఈ శిఖరమునందలి తీర్థములుకూడ అందే వివరింప బడినవి. మొదటిశిఖరమున సానంది–నంది – శుక్ల తీర్థములు కలవు. రెండవ శిఖరముపయి సోమలి – కీర్తి – గళగ అను తీర్థము లున్నవి. మూడవ శిఖరముమీద తామ్ర–విచిత్ర– జాహ్నవి అను తీర్థములు కలవు. నాల్గవ శిఖరమున భారతి– చారుఘోషిణి – అరుషిణి అను తీర్థములు కలవు. ఐదవ శిఖరమున మహాజ్యోతి – జయ – విజయ అను తీర్థములు కలవు. ఆఱవ శిఖరముపై వక్ర – పృథువు – అభిస్మృతి అను తీర్థములు కలవు. ఏడవ శిఖరమున జ్యోతి – అర్చి – చతురస్ర అను తీర్థము లున్నవి. ఎనిమిదవ శిఖరముపయి రుత్సి – క్షేమ– శుక్ల అను తీర్థములు కలవు.

మఱియు నిచ్చట దూకి చచ్చు కొండవాగు కలదు. కొండచరియనుండి, ఆ వాగులో దూకి చచ్చినచో ముక్తి లభించునని తలఁచి, భక్తులు కొందఱు సాహసించి, యట్లు చేయుచుండిరఁట!

మఱియు నీ తీర్థములలో నానా యా మాసములలో స్నానముచేసినఁ గలుగు ఫలములును శ్రీపర్వతపురాణము నందే వివరింపఁబడినవి. పురాణములలో వీనింగూర్చిన వివరము లున్నను, నేటికాలమున నీ శిఖరములలోఁ గొన్నిటిని గుర్తించుటగాని, ఆ తీర్థములను కనుగొనుటగాని, వానిం జేరుటగాని సాధ్యమైనపనులు కావు.

---

# శిల్పకళ

శ్రీశైలమునందలి శిల్పకళనుగూర్చి తెలిసికొనుట కచ్చటి దేవాలయములును, మర్గప్రాకారకుడ్యముల మీఁది శిల్పములును, శిథిలావస్థలో నున్న మందిరములును, కొన్ని శిధిలములును ఆధారములు.

శ్రీశైలపర్వతమునకుఁ బోవునపుడు దారి పొడుగు నను, శిథిలములైనఆలయములు, ప్రాకారద్వారములు, కొన్ని మండపములు కన్పించును. వీనినిబట్టి చూచినచో శ్రీశైల మొకప్పుడు మహోన్నతదశయం దుండినట్లు స్పష్టముగాఁ గలదు. శిథిలములనుబట్టి, యీనిర్మాణములు క్రీ. శ. 14—వ శతాబ్దికంటెఁ ప్రాచీనములు కానట్లు తోఁచుచుండును.

క్షేత్రమునందలి నిర్మాణము లన్నియును శిల్పకళతో విలసిల్లుచున్నవి. ప్రాకారకుడ్యములు పెద్ద పెద్ద రాళ్లతో నిర్మింపఁబడుటచే, ఆ శిలలపై రథ, గజ, తురగ, పదాతుల వరుసలు, మానవుల తీరులు, భక్తుల మహాత్మ్యలు, దైవాంశ సంభూతుల పద్ధతులు, దైవప్రతికూలు రగువారి క్రూర చర్యలు, భగవంతుని లీలలు, తరుణోపాయములు, తరించిన వారి రూపములు ఇంపుగాఁ జెక్కఁబడి యున్నవి.

శైవవిగ్రహములనుగూర్చిన వివరములు తెలిసికొనఁ గోరువారికి ఇచటి శిల్పములు ప్రదర్శనాలయములుగా నుండఁ



ప్రాకార కుడ్యముమీది నాగశిల్పము

గలవు. ఇచట శివుని లీల లన్నియు ప్రదర్శింపఁబడియున్నవి. భారత, రామాయణాది కథలు, పరమశివుని కథలు అన్నియు మిక్కిలి సూక్ష్మము లగు వివరణములతో నున్నవి. పార్వతీ వివాహము, అర్జునుని తపస్సు, విశ్వకర్మ శివునకుఁ జేసిన తులా



ప్రాకారమునందలి యొక శిల్పము

భారము, శివుని భిక్షాటనము, దారుకావనవిహారము, శివుఁడు మార్కండేయుని రక్షించుట మున్నగు కథ లన్నియు మిక్కిలి యందముగా చెక్కఁబడియున్నవి.

ఆలయ విమానశిల్పము పల్లవులనాఁటి దని కొందఱు చాళుక్యుల నాఁటి దని కొందఱును అనుకొందురు.

దుర్గకుడ్యమున అడుగున నున్న వరుసలో ఏనుఁగుల చిత్రములు కలవు. ఆ యేనుఁగులు తొండములతో వృక్షములను బట్టుకొని యున్నట్లు కలవు. దానికి పయివరుసలో గుఱ్ఱముల చిత్రములు. వేఁట చిత్రములు, ఖడ్గము మున్నగు నాయుధములను ధరించి, యుద్ధసన్నద్ధులైన వీరుల చిత్రములు ఎంతో ఆకర్షణీయములై యుండును.

శిలలపైఁ జెక్కఁబడిన శిల్పములే కాక, ఇత్తడితోఁ దయారుచేయఁబడిన శిల్పములు నిచట నసంఖ్యాకముగ నున్నవి. వీని నన్నిటిని గమనించిన నొక శిల్పప్రదర్శనశాల వలెఁ దోఁచును. విగ్రహములలో నటరాజస్వామి విగ్రహ మెంతో ఆకర్షణీయమై, ముచ్చటగొలుపుచుండును.

## జరుగవలసిన పనులు

తగినస్థితిలో నుంచి, ఇచటి మండపములు, శిల్పములు మున్నగువానిని కాపాడకపోవుటవలనఁ జాలవఱకు నివి క్షీణించినవి. శిథిలమైపోయిన భవనములు–మండపములు మున్నగు వానితోఁ బాటు, అందలి కళాఖండము లెన్ని నశించియుండునో?

ప్రాకారముపయి అనేక శిల్పఖండము లుండుటవలన దానిని తొలుదొల్త రక్షింపవలసియున్నది. లేనియెడల శిథిలావస్థలో నున్న ప్రాకారము పూర్తిగా చెడిపోయి, ఉన్న కళాఖండములైనను దక్కకుండ పోవును. పడమటివైపున నున్న ప్రాకారము కూలిపోయినది. కొన్నిచోట్ల రాళ్లు పడిపోయి యున్నవి. మఱికొన్నిచోట్ల ఎండకును, వానకును లోనయి

కొన్ని శిల్పములు, చూపు, రేఖ లేక పోలికపట్టుటకు అసాధ్యముగ నున్నది.

ప్రాకారమే కాక, ఆలయమునందలి భాగములు కొన్ని జీర్ణమైపోవుచున్నవి. గర్భాలయము ముంగు ద్వారముపయిం గల రాయి పగిలిపోయినది. దానిని సరిచేయనిచో ప్రమాదము సంభవింపవచ్చును. లోపలిభాగమున నున్న హరిహరరాయలు కట్టించిన మండపములోని రాతి పిట్టాలము పగులిచ్చినది. దానిని వెంటనే సరిచేయవలెను. హరిహరరాయలు కట్టించిన గోపురము, శివాజీ కట్టించిన ఉత్తరగోపురము శిథిలావస్థలో నున్నవి. కళావైభవము చెడిపోకుండ, వానిని పునరుద్ధరింపవలెను. అందులకై అనుభవజ్ఞులగు ఇంజినీర్లు శ్రద్ధపూని యీ పనికి సిద్ధపడవలెను. ప్రాచీన కళాఖండములకు రక్షణ నిచ్చు రాష్ట్రప్రభుత్వమువారును, కేంద్రప్రభుత్వమువారును వెంటనే తగిన శ్రద్ధతీసికొని వీనిని పునర్నిర్మింపవలసి యున్నది.

పురాతన నిర్మాణములను అడుగడుగునను పరిశీలించి, తగినట్లు మరమ్మత్తు చేయింపవలెను. ఇట్లు శ్రీకృష్ణదేవరాయల కాలములో జరిగినట్లు తెలియుచున్నది. ఆ ప్రభువు యాత్రికుల సౌకర్యముకొఱకు బావులను త్రవ్వించుటయే కాక తూర్పుగోపురమును మరమ్మతు చేయించెను. అపుడు గర్భాలయమున నేలపై నంతటను బంగారు రేకులు పరుపంబడి యుండెడివంట! ఇప్పుడా బంగారు రేకులు లేవు. గర్భగుడి గోడలు బీటలువాఱినవి. అన్ని మండపములును వానకు కాఱియుచున్నవి. వీనిని పునర్నిర్మింపవలెను. మురుగునీరు

పోవు కాలువలు పూడిపోయినవి. వానిని తిరుగ త్రవ్వింప వలెను. నీటి సదుపాయము, దీపముల సౌకర్యము లేనియెడల యాత్రికులు శ్రమపడవలసివచ్చును. ఉత్సవములు జరుగు నపుడు కల్గింపఁబడు సౌకర్యములు నిత్యము జరుగుట కేర్పాట్లు జరుగవలసియున్నది.

# ఉత్సవములు

దివ్యస్థలములలో నిత్యము ఏదో యుత్సవములు జరుగుచుండుట పరిపాటి. కాని, యీ క్షేత్రము దుర్గమములగు పర్వతముల నడుమ నుండుటవలన ప్రధాన పర్వదినములలో తప్ప, ఇతరకాలములం దిచ్చటికి యాత్రికులు వచ్చుట యరుదు. మకరసంక్రాంతి, మహాశివరాత్రి, సంవత్సరాది- ఇచటి ప్రధానోత్సవదినములు. మఱియు చైత్రశుద్ధ పూర్ణిమా దినమున భ్రమరాంబాదేవిసన్నిధిలో కుంభోత్సవము జరుగును. సంక్రమణమునుండి చైత్రశుద్ధపూర్ణిమవఱకును యాత్రికుల రాకపోకలు విరివిగ సాగుచుండును. ఈ యుత్సవములకు దక్షిణదేశమునందలివారెల్లరును - ఆంధ్రులు, కర్ణాటకులు, అఱవలు, మహారాష్ట్రులును వత్తురు. శివరాత్రికిని, సంవత్సరాదికిని కర్ణాటకు లధికముగ వత్తురు. ఆంధ్రదేశములోని యన్నిప్రాంతములనుండియు శివరాత్రి కెక్కువగా యాత్రికులు వత్తురు. ఏలయన - సర్వప్రధానమైన ఉత్సవ మిచట శివరాత్రియే !

'భక్తిమతిలింగపతి' అని యార్యోక్తి. భక్తపరాధీనుఁడగు శంకరుఁడు తన్ను గొల్చు జనులయెడ అమిత వాత్సల్యమును జూపును. అతఁడు భక్తుల భక్తిభావమును బరీక్షించి, వారి వారికిఁ దగిన ఫలముల నొసఁగుచుండును. భక్తు లెంత శ్రమపడి భగవంతుని సన్నిధి కేఁగుదురో, భగవంతునికి

భక్తులపయి అంత వాత్సల్య ముండును. తక్కిన క్షేత్రములు సులభగమ్యములు. శ్రీశైలము సులభగమ్యముకాదు. దానిని జేరుట కెంతో శ్రమపడవలసి యున్నది. వ్యయ మధికము. ప్రమాదము లనంతములు. ఇన్నింటిని సహించి శ్రీపర్వత మును జేరిన భక్తులపయి పరమశివునకు వాత్సల్య ముండుట సహజమే కదా!

మఱియు శివరాత్రి శంకరునకు ప్రీతిని కలిగించు పర్వ దినము! ఆదినమున-శ్రీశైలమున భగవంతుని దర్శించి నచో, ఆ దేవదేవునికి అమితమగు వాత్సల్యము కలుగుటయు సహజమే!

మహాశివరాత్రి పుణ్యసమయమునందు శ్రీశైల మల్లి కార్జున దేవుని దర్శనమునను, ఆరాధనాదులవలనను కైవల్య మును సాధింపవచ్చునని పురాణములు చెప్పుచున్నవి. పర్వత మును దిగి పాతాళగంగకు పోయి, స్నానము నొనర్చి, యా తీర్థమును దెచ్చి, దానితో పర్వతలింగము నభిషేకించినపుడే శివరాత్రివ్రతము పూర్తి యగు నని పెద్దలు చెప్పుదురు.

ఒకప్పుడు ప్రళయకాలమున తన సంహారకార్యమును నిర్వర్తించి పరమశివుఁడు రాత్రిసమయమున భయంకరముగ తాండవ మొనర్చుచుండెను. అపుడు జీవరాశి యంతయును పిండరూపమున నేకమై చాలకాలము లయస్థితియందే యుండెను. అప్పుడు సర్వమంగళ యను సార్థకనామము గల పార్వతీ దేవి పరమేశ్వరునిఁ జూచి 'జీవరాశి ప్రపంచమునం దుండు అల్ప కాలములోను లయకారుఁడ వగు (మహాదేవుఁడ వగు) నిన్ను

సేవించి, తరించుట కనుకూలమగు నొక సమయమును నిర్ణయింపవలె' నని ప్రార్థించినదఁట! పరమశివుఁ డామె ప్రార్థనను మన్నించి - మాఘ శివరాత్రినాఁడు తన్ను పూజించిన భక్తుల కేయుపద్రవములు కలుగ వనియు, ముక్తి లభించు ననియుఁ జెప్పెను. మఱియుఁ బ్రళయము రాత్రివేళనే జరిగినందున, తన యారాధనముకూడ రాత్రిసమయమునందే జరుగవలె నని నిర్ణయించెను. ఆ శివారాధనానుకూల మగు రాత్రియే మహాశివరాత్రి యని ప్రసిద్ధమైనది. అట్టి మహా పర్వదినమున శ్రీశైలమునందలి పర్వతలింగము నారాధించిన యెడల జనులు, జనన మరణాది మహాక్లేశములతో నిండిన సంసారమునకు దూరులై శివసాయుజ్యమును బొందఁగలరు. శివుఁ డాదేశించిన యీ పద్ధతిని శివారాత్రిదినమున శ్రీశైలమున భగవదారాధన మొనర్చినవారికి ముక్తి కరస్థముకాక మ రేమగును?

ఉత్సవవిషయమున మిగిలిన దేవాలయములకును, శ్రీశైలమునకును, ఒక వ్యత్యాస మున్నది. సాధారణముగా దేవాలయము లన్నింటియందును_ఉత్సవసమయములలో ఊరేగింపు చేయుటకును, కల్యాణాదులు జరుపుటకును ఉత్సవవిగ్రహములు ప్రత్యేకముగ నుండును. మూలవిగ్రహముల కెట్టి యుత్సవములు జరుగవు. ఈశ్రీశైలమున ఉత్సవవిగ్రహములు కూడ ఒకయెడ స్థిరముగా ఉంచఁబడును. ఊరేగింపులు మున్నగునవి వానికి జరుగవు. ఉత్సవాదుల కొఱకు ప్రత్యేకముగ విగ్రహము లుండును.

భ్రమరాంబాదేవి వివాహమహోత్సవ మిచట శివ రాత్రి మహోత్సవ సమయమునందే జరుగును.

శివరాత్రి సందర్భమునందు భ్రమరాంబాలయమున జరుగు "మంగళపాగా" ఉత్సవమున కిచట ప్రాముఖ్యము కలదు. శివరాత్రి యింకను కొన్ని దినములకు రానున్న దనఁగానే–అనఁగా కొన్ని దినములకు ముందుగనే–భ్రమరాంబా దేవి సన్నిధిలో ఈ 'మంగళపాగా' సమర్పణ కైంకర్యము జరుగును. దినమున కొక మూర వంతున సంవత్సరపు లెక్కతో మున్నూట యఱువదిమూరల తలపాగా గుడ్డ యొకటి ముందుగనే నేయించి సిద్ధము చేయఁబడి యుండును. ఆ వస్త్రమును దేవాలయగోపురము మీఁద నున్న కలశము నుండి ముఖమండపముపై నున్న నంది మెడకు పాగా చుట్టి నట్లు చుట్టుట ఆచారము. శివరాత్రి యుత్సవములు ముగిసిన తర్వాత ఈ వస్త్రమును విప్పి, చిన్న చిన్న ముక్కలుచేసి దేవిప్రసాదముగా భక్తులకు పంచిపెట్టఁబడును.

చైత్ర శుద్ధ పూర్ణిమకు భ్రమరాంబాదేవి సన్నిధిలో కుంభోత్సవము జరుగును. అప్పుడు దేవి సన్నిధిని కుంభము నుంచుట, బలిహరణము మున్నగు పూజాపద్ధతి యంతయు శాక్తేయ విధానమున జరుగును.

ఇటీవల కొన్ని యేండ్లనుండియు నీ క్షేత్రమునందు చైత్ర శుద్ధ పంచమి మొదలు నవమి వఱకును పాంచాహ్నిక దీక్షతో చండీయాగము జరుపఁబడుచున్నది,

ఈ క్షేత్రమునందు ధూళి దర్శనము ప్రధానము. కొండ లెక్కి వచ్చిన యాత్రికులు కాళ్లైనను కడుగుకొనకుండ, ధూళితోనున్న పాదములతోనే మల్లికార్జునస్వామి గుడికిఁ బోయి, మొాకరించి, శివలింగ శిరోభాగము నుదుట తాకునట్లు స్పృశించి సంతృప్తిఁ జెందుదురు. జాతి విచక్షణ లేక హైందవు లందఱు నిచటి మల్లికార్జునలింగమును స్పృశింపవచ్చును. భక్తపరాధీనుఁ డగు మల్లికార్జున దేవుఁడు సర్వసులభుఁ డగు టలో వింత యేమున్నది ?

శివరాత్రికి వచ్చిన భక్తుల ధూళిదర్శనానంతరము గుడికి మైలుదూరమున నున్న పాతాళగంగకు - తొమ్మిది వందల మెట్లు దిగిపోయి, స్నానాదులు నిర్వర్తించుకొని పాత్ర ములలో జలమును నింపుకొనివచ్చి, యా జలముతో లింగాభి షేక మొనర్తురు. ఇట్లభిషేకము చేసిననే యాత్రికుల యాత్ర పూర్తికాఁగలదఁట !

పూర్వ మిచటికి వచ్చుటకు తగిన సౌకర్యములు లేనందున యాత్రికులు ఉత్సవసమయములలోనే వచ్చుచుండెడి వారు. ఇప్పుడు శ్రీశైలమునకు మార్గము పడి బస్సుల సదు పాయ మున్నందున నిత్యము యాత్రికులు స్వామిదర్శనము చేసికొనవచ్చును. కావున భక్తులందఱును శ్రమలేకయే దేవ దర్శనము చేసికొని తప్పింపవచ్చును.

## పూజా విధులు

భక్తులవలన వసూలగు సుంకములుతప్ప శ్రీశైల దేవస్థానమునకు వేఱే ఆదాయములేదు. సంవత్సరమునకు నలువది వేల రూపాయలవఱకును ఆదాయము వచ్చును. ఇది దేవాలయముల కగు ఖర్చునకును, ఉద్యోగులయొక్కయు, పనివాండ్రయొక్కయు జీతములకైనను సరిపోదు. దేవాలయము నందలి జీర్ణభాగములను పునర్నిర్మించుటకును, వసతిభవనములకును యాత్రికులకుఁ గావలసిన సౌకర్యములను కలిగించుటకును లక్షలకొలది ధనము కావలసియున్నది. అందులకై దేవస్థానమువారు అర్చనాది కైంకర్యములకై కొన్ని రుసుములను ఏర్పఱచియున్నారు. ఆ వివరము లిచట నీయబడుచున్నవి.

### శ్రీమల్లికార్జునస్వామి దేవాలయమున

| | విరాళము రు. నపై. |
|---|---|
| 1. దేవాలయప్రదేశమునకు, దర్శనమునకును | 1–00 |
| 2. కర్పూరహారతికి, కొబ్బరికాయ కొట్టుటకు లేక వత్తులు వెలిగించుటకు | 0–50 |
| 3. మహాన్యాసపూర్వక–కారక శతానువాక సహిత–అతి రుద్రాభిషేకము 1331 ఆవృత్తులకు | 1116-00 |
| 4. మహాన్యాసపూర్వక–కారక శతానువాక సహిత మహారుద్రాభిషేకము 121 ఆవృత్తులకు | 250–00 |

| విరాళము | రు. నపై. |
|---|---|
| 5. మహాన్యాసపూర్వక–కారక శతానువాక సహిత రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు | 116–00 |
| 6. మహాన్యాసపూర్వక–కారక శతానువాక సకృద్వారాభిషేకము–ఏకావృత్తికి | 50–00 |
| 7. మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకము 121 ఆవృత్తులకు | 50–00 |
| 8. మహాన్యాసపూర్వక రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు | 5–00 |
| 9. మహాన్యాసపూర్వక సకృద్వారాభిషేకము ఏకావృత్తికి | 15–00 |
| 10. లఘున్యాసపూర్వక రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు | 20–00 |
| 11. లఘున్యాసపూర్వక సకృద్వారాభిషేకము ఏకావృత్తికి | 10–00 |
| 12. రుద్రాభిషేకము–11 ఆవృత్తులకు | 15–00 |
| 13. సకృద్వారాభిషేకము–ఏకావృత్తికి | 5–00 |
| 14. పురుషసూక్తవిధానమున శివ సహస్రనామ పూజకు. | 6–00 |
| 15. శివసహస్రనామ పూజకు | 5–00 |
| 16. భృంగి పూజకు | 5–00 |
| 17. పురుషసూక్తవిధాన త్రిశతిపూజకు | 4–00 |
| 18. త్రిశతిపూజకు | 3–00 |

| | |
|---|---|
| 19. పురుషసూక్తవిధానమున శివాష్టోత్తర శతనామ పూజకు | 3–50 |
| 20. శివాష్టోత్తర శతనామ పూజకు | 2–50 |
| 21. లక్ష బిల్వార్చనకుఁ గాని లక్ష కుసుమార్చనకుఁ గాని, సహస్ర ఘటాభిషేకమునకుఁగాని | 116–00 |
| [ఈ యర్చనకు కావలసిన పూజాద్రవ్యములను ఋత్విక్కులను పూజ చేయించుకొనువారే సమకూర్చుకొనవలెను. ఋత్విక్కుల కీయ వలసిన దక్షిణలను కూడ వారే ఇచ్చుకొన వలెను.] | |
| 22. జరుపు దండములకుఁగాని, పొర్లు దండము లకుఁ గాని | 5–00 |
| 23. పుట్టువెండ్రుకలకు | 6–00 |
| 24. ఉపనయనమునకు | 25–00 |
| 25. వివాహమునకు | 25–00 |
| 26. వెండి నందివాహనపుసేవకుఁగాని, కైలాశ వాహనసేవకుఁ గాని, రావణ వాహన సేవకుఁగాని | 50–00 |
| 27. పల్లకిసేవకు | 12–00 |
| 28. రుద్రాక్షసేవకు | 25–00 |
| 29. దర్పణసేవకు | 5–00 |
| 30. మహానైవేద్యము (వండినపదార్థము) నకు | 2–00 |

## శ్రీ భ్రమరాంబాదేవి ఆలయమున

| | |
|---|---|
| 1. శ్రీసూక్త విధానమున సహస్రనామపూజకు | 6–00 |
| 2. సహస్రనామపూజకు | 5–00 |
| 3. శ్రీసూక్త విధానమున త్రిశతిపూజకు | 4–00 |
| 4. త్రిశతిపూజకు | 3–00 |
| 5. శ్రీసూక్త విధానమున ఖడ్గమాల పూజకు | 4–00 |
| 6. శ్రీ దేవీ ఖడ్గమాల పూజకు | 3–00 |
| 7. శ్రీ సూక్త విధానమున అష్టోత్తరశతనామ పూజకు | 3–50 |
| 8. అష్టోత్తరశతనామపూజకు | 2–50 |
| 9. కర్పూరహారతికిఁ గాని, కొబ్బరికాయకుఁ గాని, వత్తులు వెలిగించుటకుఁ గాని | 0–50 |
| 10. వస్త్రాలంకరణమునకు | 5–00 |
| 11. మహానివేదనకు | 5–00 |
| 12. దర్పణసేవకు | 5–00 |
| 13. గండదీపమునకు | 2–50 |
| 14. లక్ష కుంకుమార్చనకుఁ గాని, లక్ష పుష్పార్చనకుఁ గాని | 116–00 |

( ఈ పూజకుఁ గావలసిన సామగ్రిని, ఋత్విక్కులను పూజ చేయించుకొనువారే ఏర్పాటు చేసికొనవలెను. ఋత్విక్కుల కీయవలసిన దక్షిణలను కూడ వారే భరించవలెను. )

## నిత్యార్చన

శ్రీశైల మల్లికార్జునస్వామివారి దేవాలయములోఁగాని, శ్రీ భ్రమరాంబాదేవి వారి ఆలయములోఁగాని జరిగెడి నిత్యార్చన కాలములో నిత్యము గోత్రనామములు చదివించుకొనఁదలఁచిన భక్తులు సంవత్సరమునకు రు. 25/= చెల్లింపవలెను. ఆరీతిగనే పయి దేవాలయములలో దేనియందైనను నిత్యహారతి సమయములో గోత్రనామములు చదివించుకొనఁదలఁచిన భక్తులు సంవత్సరమునకు రు. 12/= చెల్లింపవలెను.

శ్రీమల్లికార్జునస్వామి విభూతిప్రసాదము, శ్రీ భ్రమరాంబాదేవి కుంకుమప్రసాదము వలయు భక్తులు దేవస్థానము కార్యనిర్వాహణాధికారి [ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు]గారి పేర ఒక రూపాయి మనియార్డరు చేసి, వారి పూర్తి విలాసమును తెలిపినయెడల – ఆ ప్రసాదము పంపఁబడును.

## శాశ్వతపు అర్చన పద్ధతులు

ఈ క్రింద చూపఁబడిన విరాళములను చెల్లించినవారి పేరఁ గాని, వారు కోరినవారి పేరఁ గాని క్రింద నుదహరింపఁబడిన అర్చనలు–వత్సరములో వారు కోరినట్టి ఒక దినమున [శివరాత్రి–సంవత్సరాదుల ఉత్సవ దినములలో తప్ప ఇతర దినములలో] శాశ్వతముగా జరుపఁబడును. వారిచ్చు విరాళములపై వచ్చు వడ్డీమాత్రమే ఆ యా అర్చనలకయి ఉపయోగింపఁబడును.

# శ్రీమల్లికార్జునస్వామివారి దేవస్థానమున

| | విరాళము రూ.నపై. |
|---|---|
| 1. మహాన్యాసపూర్వకముగ కాఠక–శతానువాక సహిత రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు– | 4000–00 |
| 2. మహాన్యాసపూర్వకముగ కాఠక–శతానువాక సహితసకృద్వారాభిషేకము–ఏకావృత్తికి– | 2000–00 |
| 3. మహాన్యాస పూర్వకముగ మహా రుద్రాభిషేకము 121 ఆవృత్తులకు– | 2000–00 |
| 4. మహాన్యాస పూర్వకముగ రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు– | 1000–00 |
| 5. మహాన్యాసపూర్వకముగ సకృద్వారాభిషేకము – ఏకావృత్తికి– | 600–00 |
| 6. లఘున్యాసపూర్వకముగ రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు– | 800–00 |
| 7. లఘున్యాసపూర్వకముగ సకృద్వారాభిషేకము – ఏకావృత్తికి | 400–00 |
| 8. రుద్రాభిషేకము 11 ఆవృత్తులకు | 600–00 |
| 9. సకృద్వారాభిషేకము – ఏకావృత్తికి | 200–00 |
| 10. పంచామృతస్నానమునకు | 100–00 |
| 11. అష్టోత్తర శతనామ పూజకు | 100–00 |
| 12. సహస్రనామ పూజకు | 200–00 |

## శ్రీ భ్రమరాంబా దేవివారి దేవస్థానమున

1. సహస్రనామపూజకు 200—00
2. అష్టోత్తర శతనామపూజకు 100—00

(శివరాత్రి ఉత్సవములలో నియమితసమయమున ఎట్టి రుసుము చెల్లింప నక్కఱలేకయే ధర్మదర్శన మిప్పింపఁబడు చుండును.

భవనములు, కుటీరములు నిర్మించుటకు విరాళముల నిచ్చు దాతలకు కొన్ని ప్రత్యేకసౌకర్యములు ఏర్పాటుచేయ బడును.)

(N. B. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి దేవాదాయ-ధర్మాదాయ శాఖవారు ప్రకటించు 'ఆరాధన' మాసపత్రిక (సం. 3 సంచికలు 9, 10) లో శ్రీశ్రీశైల దేవస్థానమువారు ప్రకటించిన 'విజ్ఞప్తి' ననుసరించి యీ పట్టిక లీయఁబడినవి.)

—

# సౌకర్యములు

పూర్వము దూరముగనుండు కాశి, రామేశ్వరము మున్నగు పుణ్యస్థలములకుఁ బోవుట యెంతకష్టమో, దగ్గఱ నున్నను శ్రీశైలమునకుఁ బోవుటయుఁ ఆంధ్రులకంత కష్టముగ నుండెనది. దేవాదాయ,ధర్మాదాయములను ప్రభుత్వము తన యాజమాన్యమున నిర్వహించుటను ప్రారంభించిన పిదప పెక్కు క్షేత్రము లభివృద్ధికి వచ్చినవనియు,ఇంకను అభివృద్ధికి రానున్నవనియు నిశ్చయముగా తెలుపవచ్చును. క్షేత్రములకు వచ్చు యాత్రికులకుఁ దగిన సౌకర్యము సమృద్ధిగా నున్నప్పుడే, ఆ క్షేత్రముల కసంఖ్యాకముగ భక్తులు వచ్చుచుండుటయు, క్షేత్రముల మహాత్తు లోకమున వెల్లడియగుటయు సంభవించును. ప్రభుత్వపు దృష్టి యీ నడుమనే శ్రీశైలక్షేత్రముపైఁ బడినది. దీని అభివృద్ధికయి జరుగు పనులలో రోడ్డువేయుట ప్రధానమైనది. అచటికి వెళ్లెడు యాత్రికుల రెండు, మూఁడు దినములైన క్షేత్రమునందుండి తలదాఁచుకొనుటకు తగిన బసలు ఉండవలెను. ఇదివఱకున్న మఠములుగాని, సత్రములుగాని మంచి స్థితిలో లేవు. ఉన్నను, అవి చాలవు. అందుచే ప్రభుత్వము బాగుగ నాలోచించి శ్రీశైలమున కొన్ని భవనములను నిర్మించుచున్నారు. జనోపయోగకరము లగు పనులకు ముందంజ వేయు దాతలను ప్రోత్సహించుచున్నారు. ఆరీతిని ముందుపడిన దాతలకు కొన్ని ప్రత్యేక సౌకర్యములను కలిగిం

చుటకు దేవాదాయ, ధర్మాదాయ శాఖవారు నిర్ణయించి యున్నారు.

## దాతలకు కలుగఁజేయు సౌకర్యములు

1. నూఱురూపాయలనుండి అయిదువందలరూపాయల వఱకు విరాళముల నిచ్చు దాతలకు దర్శనపు రెసుము చెల్లింప నక్కఱలేకయే – వరుస తప్పించి – ముందుగా దేవదర్శనము చేయింపఁబడును.

2. రూ. 500/-నుండి వేయి రూపాయలవఱకును విరాళము లిచ్చు దాతలకు మీఁది సౌకర్యముతోపాటు సంవత్సరమునకు మూఁడు దినములు ఉచితవసతి సౌకర్యము కలిగింపఁబడును.

3. వేయి రూపాయలనుండి రెండు వేల రూపాయల వఱకు విరాళము నిచ్చు దాతలకు పయి రెండు సౌకర్యములతోపాటు వారి పేర్లు – ఫలకముపై చెక్కింపఁబడును.

4. రెండువేల రూపాయలకు పైగా విరాళము నిచ్చు దాతలకు పైనిచెప్పిన సౌకర్యము లన్నియును కల్గింపఁబడును. మఱియును, వా రిచ్చు ధనము వారు కోరిన నిర్మాణమునకై వినియోగింపఁబడును. అట్టి నిర్మాణముపయి వారిపేరు చెక్కింపఁబడును.

## భవనముల వివరము

యాత్రికుల బసలకయి మూఁడు రకముల భవనములను నిర్మింప ప్రభుత్వము సంకల్పించి యున్నది. వానిలో కొన్ని

యొంటి గదుల యిండ్లు, కొన్ని రెండు గదుల యిండ్లు, కొన్ని మూఁడుగదుల యిండ్లు. ఈ యిండ్లలో వంటకు, స్నానమునకు ప్రత్యేకముగ సౌకర్యము లుండును. ఒంటిగది గల యింటికి నాలుగువేల అయిదువందల రూపాయ లగుననియు, రెండు గదుల భవనమునకు ఏడువేల రూపాయ లగుననియు, మూఁడు గదుల భవనమునకు పదివేల రూపాయ లగుననియు అంచనా వేయఁబడెను. ఈ భవనముల నిర్మాణమునకు దేవస్థానము భరించు సొమ్ము నాల్గవ వంతు. మిగత మూఁడు వంతులు భరించు దాతల పేర్లు ఆయా భవనములపయి ఉదాహరింప బడును. మఱియు సంవత్సరమున పదిదినములపాటు వారికిఁ గాని, వారి ఉత్తరువు పొందినవారికిఁగాని, ఆ భవనములలో ఉచిత వసతి సౌకర్యములు కల్గింపఁబడును.

భవనముపయిఁగాని, భవనమును నిర్మించిన స్థలము పయిఁగాని దాతలకెట్టి హక్కులును ఉండవు.

శ్రీశైల దేవస్థానపు స్థానికాభివృద్ధి పథకముప్రకారము ఇరువదివేల రూపాయల ఖర్చుతో ఒక విశ్రాంతి భవనము నిర్మింపఁబడుచున్నది. మఱియు శ్రీగండి-నాగయ్యశ్రేష్ఠిగా రొసఁగిన విరాళముతో ఒక భవనము నిర్మింపఁబడుచున్నది. ఈ రెండు భవనములకును, ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి శ్రీ నీలం-సంజీవరెడ్డిగారు తేది 24-11-1957 న పునాదిరాయి వేసిరి. మఱియు శ్రీ కె. శ్రీనివాసులుగారు, శ్రీ జోగప్పగారు, శ్రీ హరిదాసుగారు ఇచ్చిన విరాళములతో నిర్మింపఁబడనున్న గృహములకు నాఁడే మైసూరురాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నిజ

లింగప్పగారు శంకుస్థాపన చేసిరి. శ్రీ మేడా-రామయ్యగారును, శ్రీ మేడా-సుబ్బయ్యగారును ఇచ్చిన విరాళములతో నిర్మింపఁ బడనున్న భవనములకు స్థానిక శాఖామంత్రి శ్రీ కాసు-బ్రహ్మానందరెడ్డిగారును, శ్రీ నరసింహులు శ్రేష్ఠిగారిచ్చిన ధనముతో నిర్మింపఁబడనున్న గృహమునకు అప్పటి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి - సత్యనారాయణగారును, శ్రీయుతులు గురివిరెడ్డి, రామకృష్ణారెడ్డిగార లొసఁగిన విరాళములతోఁ గట్టఁబడనున్న గృహములకు ముఖ్యమంత్రు లిద్దఱును నాఁడే శంకుస్థాపన చేసిరి.

శ్రీశైలము సముద్రమట్టమునకు 1500 అడుగుల యెత్తున నుండుటవలన నిచటి వాతావరణము చల్లనై హాయిని గొల్పుచుండును. ఇచటికిఁ బోవు మార్గములు సుందరదృశ్యములతో నిండియుండుటవలన యాత్రికులే కాక యితరులు నచటికిఁ బోవుటకు కుతూహలపడుచుందురు. ఇచట భవనములను నిర్మించుటకు ఉదారులు పెక్కుమంది మాట యిచ్చియున్నారఁట! కావున కొలది కాలములో నియ్యది విశ్రాంతితీసికొనుట కనువగు గిరినగరముగా తయారయి పూర్వపు ఔన్నత్యమును పొందఁగలదని విశ్వసింపవచ్చును. ఇచట ఏఁబది వేల రూప్యములు వెచ్చించి సుందరమగు అతిథిగృహమును భారతప్రభుత్వము నిర్మించుచున్నది.

ఒక్క శ్రీశైలముననేగాక — శ్రీశైలమునకుఁ బోవు మార్గములలోఁగూడ యాత్రికులకు సదుపాయముగా కొన్ని

గృహములనుకట్టించుచున్నారు. కర్నూలుజిల్లాఆత్మకూరులో సూర్యసింహాసనాధిపతుల పీఠమువద్ద వీరశైవ సంఘమువారు ముప్పదివేల రూపాయలు వ్యయపఱచి 'యాత్రికనివాస'మను నొక సుందర భవనమును కట్టించిరి. దానిని మైసూరు రాష్ట్రి ముఖ్యమంత్రి శ్రీ నిజలింగప్పగారు – తాము శ్రీశైలమునకు వచ్చిన సందర్భమునసే బహిర్గత మొనర్చిరి. ఈ వీరశైవ సంఘమువారే శ్రీశైల క్షేత్రమున లక్షరూపాయలు వెచ్చించి యొక సత్రమును నిర్మింప సంకల్పించి యున్నారు. వారీ విష యమై విరివిగా చందాలు వసూలుచేయుచున్నారు.

శ్రీశైల ప్రయాణము కొంత శీఘ్రముగను సుగమము గను జరుగుటకు రోడ్డునకు తారు వేయవలసియున్నది. అవసర మగుచోట్ల సిమెంటువేయవలసి యున్నది. దీనికయి కేంద్ర ప్రభుత్వమునుండి ముఖ్యమంత్రి శ్రీసంజీవరెడ్డిగారి కృషివలన ఐదులక్షల రూప్యములు లభించినవి. ఈ పనియును త్వరలోనే ముగియవచ్చును.

ఇదివఱలో శ్రీశైలముపయి ఏవస్తువులును లభించుట కష్టముగనుండెను. ఒంటరిగా పోవువారు భోజనమునకై మిగుల శ్రమపడవలసివచ్చెడిది. కాని, యిప్పుడు శ్రమలేదు. వంటచేసికొనువారికిఁ గావలసిన వస్తువులను సరఫరా చేయుట కొక వస్తువిక్రయశాల ఏర్పఱుపఁబడినది. కుటుంబములతోఁ గాక, ఒంటరిగా వచ్చువారియొక్కయు, వంటచేసికొన నిచ్ఛ గింపనివారియొక్కయు సౌకర్యమునకై ఒక భోజనశాల ఏర్ప ఱుపఁబడినది. అందు కాఫీ, ఫలహారములును, భోజనమును

లభించును. పం|డెండణాల కచ్చట చక్కని భోజనము లభింపఁగలదు.

ఇచట నివసించువారియొక్కయు, యాత్రికుల యొక్కయు సౌకర్యమునకయి యీ నడుమనే ఒక పోష్టాఫీసు ప్రారంభింపఁబడినది. ఏకారణముచేతనయినను, ఇచటికి రాఁజాలని భక్తులు తమ మ్రొక్కుబడులను చెల్లించుటకును, తాము కోరిన పూజలను జరిపించుటకును ఇది మిక్కిలి అనుకూలమయి యుండును.

పదేండ్ల క్రిందటి శ్రీశైలమునకు, ఇప్పటి శ్రీశైలమునకును ఎంతో వ్యత్యాసము కలదు. అప్పుడు నిర్మానుష్యములగు ప్రదేశము లిపుడు జనసంచారము కలిగి ఎంతో కలకలలాడుచున్నవి. శిథిలములకు మరమ్మత్తులు జరుగుచున్నవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము దీని యభివృద్ధికయి పెక్కువిధముల కృషి చేయుచున్నది. కేంద్రప్రభుత్వముకూడ శ్రీశైల నగర పునర్నిర్మాణమునకు ద్రవ్యసహాయ మొనర్చుచున్నది. ఇతర రాష్ట్ర ప్రభుత్వములును చేదోడువాదోడగుచున్నవి. ధనికులు భూరి విరాళముల నొసఁగుచు తమ కీర్తి స్థిరముగా నుండు నిర్మాణముల నొనర్చుచున్నారు. ఇఁక భక్తవరుల సహకారము లభించినచో, శ్రీశైలము గొప్ప పుణ్యక్షేత్రముగానే కాక పెద్ద గిరి నగరముగాఁ దయారుకాఁగలదని దృఢముగా నమ్మవచ్చును.

Kubera Printers (Private) Ltd. Madras-1.